టచే ఆ పదము 'జలే' అని గుర్తింప ననువును అవ సరమును కలిగించుచున్నది.

ఇక మిగిలియున్నది శాసనకాల నిర్ణయము. ఇయ్యది మిగత అన్ని విషయములకంటె ముఖ్యమైనది. ఇందు 'శాకే శైల మునివ్యయేందు సహితే' అను సంఖ్యా వాచకము సంజ్ఞితమైనది. అనగా శైల=7; ముని=7, వ్యయ=0; ఇందు=1. అనగా శా. శ. 1077 అని సూచింపబడినది. అయితే కొందరు పెద్దలు దానిని 'శాకే శైల మునిత్రయేందు సహితే' అను పాఠముగా గుర్తించి శా. శ. 1377 గావలెనని సూచించుచున్నారు. అంతేగాక వారు తాము 'ఆల్మనిక్' పరిశోధించితిమనియు శా.శ. 1077, 1377 గూడ 'యువ' సంవత్సరమే అగుటచే దానిని 1377 గానే యుండవలెను గాని 1077 గా మార్చవలసిన యవసరము లేదనుచున్నారు. Companion work 'Indian Ephemeris' Indian Chronology, Solar Lunar, planetery, by Diwan Bahadur L. D. Swami Kunnu Pillai Madras ఎంత ప్రయత్నించినను నాకు దొరకలేదు. అందుచే నితర మార్గము అన్వేషింపవలసి వచ్చినది. 'శాకే శైల మునిత్రయేందు సహితే' అనికదా పెద్దలపాఠము. ఆ అక్షరము 'త్ర'యా లేక 'వ్య'యా అని పరిశీలింపవలసి యున్నది. ప్రస్తుత లిపి ననుసరించిన సామాన్యుల కందరకును అయ్యది 'త్ర'వలెనే గాన్పించుట ప్రకృతి సహజము. అయితే యీ శాసనలిపి, నేటిదిగాక కనీసము 8 లేక కనీసము 5 శతాబ్దముల నాటిది. ఆ కాలపు శాసనలిపులందు 'త'; 'వ' అక్షరములు ఎట్లు వ్రాయబడినవో గమనింపవలెను. ఇతర శాసనము లక్కఱలేకుండ ఈ యొక్క శాసనమునే పరిశోధించిన ఈ అక్షరము గాకుండ 5 'వ'కారములు; 6 'త' కారములును గానవచ్చును. అందు 3 వ పంక్తిలోని 'హితే' అనుదానియందు గల 'త' యొక్కటియే దీనికి కొంచెము సన్నిహితముగా గాన్పించును. కాని మిగిలిన అన్నిచోట్లను 'త' కారము '6' కుడిభాగమున బోర్లించిన అర్ధవృత్తమును వ్రాసి క్రిందినుండి ఎడమకుబోయి ఊర్ధ్వము నకు వట్రువగా బోయెను. ఇట్లే 10 మొదలు 15 శతాబ్దుల శాసన లిపియందు 'త' కారము '6' ఇట్లే వ్రాయబడియుండుట గమనార్హము. అయితే 'వ' కారమును గమనించినచో ఈ 'వ' కారమొక్కటియే భేదించినది కాని మిగిలిన 'వ' కార, 'మ' కార, 'ప' కారములయందు ఎడమను పొక్కిలి పై భాగమున ప్రారంభించి క్రిందికిదింపి పొక్కిలినిచ్చి కుడికివచ్చి ఊర్ధ్వమునకు కొద్ది వట్రువనిచ్చి శిరోభాగమున గుణితపు గుర్తునిచ్చెను. దీనియందుగూడ ఎడమనున్న పొక్కిలి ఎడమభాగముకన్న కుడిభాగము చాలగా పెంచెను. కావున అశ్రద్ధగా వ్రాసిన 'వ' కారముగా ప్రతిబింబించును. అందున్న సంయుక్తము పెద్దలు రేఫమనుచున్నారు. అయితే 5 చోట్ల 'ద్ర' 'శ్రీ', 'ప్రో' అని వ్రాయునపుడా రేఫమును ఆయా అక్షరముల ఎడమవైపు శీర్షమందు ప్రారంభించి క్రిందికి కొద్ది వట్రువద్రిప్పి కుడిచివరకు ఆ వట్రువను పూర్తిచేసెను. కాని ఈ అక్షరమందలి వట్రువ అట్లుగాక అక్షరపు క్రిందిభాగమున పొక్కిలినుండి ప్రారంభించి కుడికి వట్రువద్రిప్పి ఊర్ధ్వరేఖ నిచ్చెను. 8 పంక్తిని 'ఖ్యం' 12 పంక్తిని 'య్యం' అను నక్షరముల గమనింప నీ విషయము స్ఫుటముకాగలదు. కావున అక్షరములు, సంయుక్తమును పూర్తిగా పరిశీలించిన అయ్యది 'వ్య' కాని 'త్ర' కానేరదనుట నిశ్చయము.

ఇక కాల నిర్ణయమును పరిశీలింతము. నా నిర్ణయము శా. శ. 1077=క్రీ. శ. 1071+78= 1155 అగుచున్నది. కాని పెద్దల నిర్ణయము శా. శ. 1377+78=1455 అగుచున్నది. ఈ రెండు నిర్ణయములకు 300 సం॥ అంతరముగలదు. పెద్దలు చెప్పినది శా. శ. 1077 అయినను, 1377 అయినను యువనామ సంవత్సరమేకదా సంశయగ్రస్తమైన అక్షరాధారముచే నెందుకు కాలమును వెనుకకు తిగియవలెనందురు. మన భారతీయ కాలమానము (పంచాంగరీత్యా) ప్రభవాదులు 60 సం॥ అనగా ప్రభవ మొదలు అక్షయవరకు 60 సం॥ ఒక ఆవృతము. మనకు గోచరించెడి కాలాంతరము 300 సం. కావున 300÷60=5 ఆవృతములు పూర్తి అయి ఆఱవ ఆవృతము ప్రారంభమయ్యెను. కావున మొదటి ఆవృతములోని ఆ 'యువ' సం॥మే తిరిగి ప్రారంభమగును. కాని ఎట్లా భేదించగలదు. అంతేగాక ఆ కార్తికము శుద్ధ చవితియునట్లే. అందేమి మాఱ్పుగలుగును. ఇక నక్షత్రము వృద్ధిక్షయముల

బట్టి మాఱవచ్చును. అట్టినక్షత్ర నిర్ణయమిందు సందేహాస్పదమైనది. ఇక ఎన్నిమార్పులువచ్చును. (రోజు) వారము తప్పక మార్పు కలుగకతప్పదు. కావున సందేహాస్పదమైన కాలనిర్ణయమందు వారమే ప్రాముఖ్యము వహించితీరును.

(1) ఆంగ్లపద్ధతి ననుసరించి కేలెండరు ప్రకారముగమనింప Conective calender ననుసరించి శతాబ్దపు సాంకేతిక ధృవసంఖ్యలయందు 11 వ శతాబ్దమున '2' అయియుండగా 14 వ శతాబ్దపు ధృవసంఖ్య '4' అయినది. అనగా నొక్క శతాబ్దపు ధృవసంఖ్యాభేదమే 4—2=2 గాన్పించుచున్నది. అంతేగాక ఆ కార్తిక శు 4. అదే నెల అదే తారీఖు అగునో కాదో తెలియదు. కావున క్రీ. శ. 1155 సం. తేదికిని, 1455 సం. తేదికిన్నీ అధమము '2' రోజులు (వారములు) భేదించుట స్పష్టముగావున శా. శ. 1077 సం. తిథికిన్ని 1377 సం. అదే తిథికిన్ని ఒకేవారము ఎన్నటికిని కాజాలదు. కావున ఈ విషయమై తిరిగి పెద్దలు ఆల్మనికునందలి ఆ రెండు తేదీలున్న మాస, పక్ష, తిథి, నక్షత్ర, వారము లను పూర్తిగా గమనింప ప్రార్థన.

2. రోజుల ప్రకారము గమనించియు బరి శోధింతముగాక. భేదించిన సంవత్సరములు 300గదా. ఆకాలమునకు 365 × 300=109500రో. + శతాబ్దమునకు 24 లీపియర్లు వంతున 24 × 3=72 లీ. 1200 సం॥ ఇంకొక లీపియర్లు మొత్తము 365 × 300 + 72 + 1 = 109573 రోజులయ్యెను. దానిని 109573 ÷ 7=2 శేషము. శాసనమం దుదాహరింపబడిన వారము మంగళవారము. కావున, క్రీ. శ. 1155 కార్తిక శు 4 మంగళవారమయినచో 1455 సం. కార్తిక శు 4, శేషించిన 2 ను కలిపినచో (1 బు, 2 గు) గురువారము కావలెను. అట్లుగాక 1455 కార్తిక శు 4 మంగళవారమైన 1155 కార్తిక శు 4 భేదించిన 2రోజుల తిగియగా శనివారము కావలెను.

ఇక పంచాంగరీత్యా కాలనిర్ణయము గమనింతము—

ద్యుగణం=అహర్గణం. (నరకంఠీరవము)

'శాకస్సురాగ్ని శ్చందో నో (1333)
భ్యస్తోఽర్కైః (12)
ర్మాసయు క్పృథక్
త్రి (3) ఘ్నస్స్వష్టాద్వినేత్రాం(248)శై
ర్యుక్తశ్శర శశాంక (15) యుక్
నాగనందా (88) ప్త సంయుక్తో
దినీకృత్యం దినాన్వితః
పృథక్స్వష్టభశైలాంశై
(708) ర్యుక్తోవేదాంగ (64) భాజితః
అబ్ధావమదినై రూన
స్సౌమ్యాది ర్దినసంచయః
ద్యుగణఃసప్త (7) భిర్భక్తం
శేషం సౌమ్యాదివాసరః
వర్జయేద్వర్ధయేదేకం
వారోనాయాతిచేతతః॥.

ఇందు శా. శ. 1333 సం॥ గణితసాంకేతి సంఖ్యానిరూపణము గావించెను. నా కాలనిర్ణయము శా. శ. 1077. కావున ఆ దినమునకు అహర్గణము కట్టవలెనన్న ఆ సాంకేతికసంఖ్యలు వేఱు. కావున అట్లు శా. శ. 1077 యువనామ సం॥ కార్తిక శు 4. అహర్గణము కట్టవీలుపొసగదు. అందువలన పెద్దలొసగిన శా. శ. 1377, కార్తిక శు. 4 నుండి అహర్గణముకట్టి పరిశీలింతము.

నేటి శా. శ. 1893. కార్తిక శు. 4 కిని పెద్దలొసగిన శా. 1377 కార్తిక శు 4. నాటి నుండి అహర్గణము సాధించి వారమును సరిపోల్చిన తప్పొప్పులు తెలియగలవు.

(1) నేటి శా. శ. 1893
నాటి శా. శ. 1377
భేదించిన సం॥ 516

(2) 516
12
మా 6192

3)
6192
3
18576 త్రిఘ్నం

(4)
248)18576(74
1736
1216
992
224

(5)
18576
74
18650
శశాంకయుక్ 15
18665

(6)
98)18665(190
98
886
882
45

(7) మా.
6192
190
6382
30
దినీకృత్యం 191460

(8)
708)191460(270
1416
4986
4956
300

(9)
191460
270
191730

(10)
64)191730(2995
128
637 అవమదినాః
576
613
576
370
320
50

(11)
191460 ది
2995 అ
188465
మొత్తము దినములు

(12)
26923
7)188465
14
48
42
64
63
16
14
25
21
4 శే

శా. శ. 1377=క్రీ. శ. 1455 యువ కార్తీక శు 4 మంగళవారమైతే దానికి 4 రోజులు కలిపిన (1 మ, 2 బు, 3 గు, 4 శు.) శుక్రవారము అగును. కాని నేటి శా. శ. 1893=క్రీ. శ. 1971 కార్తీక శు. చ. శుక్రవారముగాక శనివారమగుచున్నది. శాసనమందు (భౌమే) మంగళవారమని స్పష్టముగాయున్నది. కావున ఎన్ని విధముల గణితము ననుసరించి పరిశీలించినను ఈ శాసనకాలము శా. శ. 1077 కు సరియైన క్రీ. శ. 1155 యువసంవత్సరమేకాని శా. శ. 1377 కు

సరియైన క్రీ. శ. 1455 యువసంవత్సరముకాదని ధృవమగుచున్నది.

ఇక చారిత్రకవిషయముల గమనించి కాలనిర్ణయము గావించుట ఉత్తమము, ప్రాముఖ్యముగలది. పెద్దలనునట్లుగా ఈ దానకాలము శా. శ. 1377= క్రీ. శ. 1455 ('శాకేశైలమునిత్రయేందు సహితే' అను పాఠము ననుసరించి) అయినట్లయిన ఆ కాలపు వేంగీ పరిస్థితుల నవలోకింతము. ఈ చోడవరం శిలాశాసన (దాన) కర్త 'రాజేంద్ర చోళ భూనరేంద్రుడు' అని 6—7 పంక్తులలోనే గలదు. మన వేంగిదేశము నేలినవారు చాలాకాలము తూర్పు చాళుక్యులు. వారి సంతతివారగు రాజరాజ నరేంద్రుని పిమ్మట 'కుళోత్తుంగ చోళుడ'ను బిరుదుగాంచిన రాజేంద్రచోడునినుండియు మిగిలిన వారు చాళుక్యచోళులని ప్రసిద్ధినొందిరి. వారి వంశీకులు క్రీ. శ. 1158 వఱకును చోడ, వేంగీ దేశముల బరిపాలించిరి. అందును క్రీ. శ. 1118 మొదలు 1143 వఱకు మాత్రమే మొదటి కుళోత్తుంగుని పుత్రులు యువరాజులై జననాథనగర వాసులై వేంగిదేశమేలిరి. అనగా ఇంచుమించు రాజ రాజనరేంద్రుని మరణము మొదలు క్రీ. శ. 1063 మొదలు చాళుక్య చోళులు సూటిగా వారు వేంగీ దేశమునేలక, రాజప్రతినిధులచేతను సామంతరాజుల చేతనే పాలింపజేసిరి. వారైనను క్రీ. శ. 1230 ప్రాంతము నాటికే వారి పరిపాలనము పూర్తిగా అంత మొందెను. ఆ పిదప కాకతీయులు, రెడ్లు, పద్మ నాయకులు మొదలగువారు ఛిన్నాభిన్నముగ వేంగీదేశ మును పరిపాలించిరి. కాని క్రీ. శ. 1447 నాటికి పూర్తిగా రెడ్డిరాజ్యముల పరిపాలన అంతమొంది నది. కళింగభూపతియగు కపిలేంద్రగజపతి యొక్కయు విజయనగర సామ్రాజ్యాధిపతుల సామంతులయొక్కయు పరిపాలనలే మిగిలెను. ఆ సమయము నెట్లు ఎచ్చట ఏ విధముగ బరికించినను వేంగీ దేశమం దేమూలనను చాళుక్య, చోళరాజుల పరిపాలనము ప్రాదేశమాత్ర మందైనను లేదనుట స్పష్టము. అట్టితఱి 12 వ శతాబ్దారంభ మందుండిన రాజేంద్రుచోళుడు 14 వ శతాబ్ది ఉత్తరార్ధమున యీ దానశిలాశాసనము నెట్లు నిర్మింపగలుగును. కావున ఇంతవఱకు పెద్దలు కాలనిర్ణయము నిలుచుట లేదు. అంతేగాక శ్రీనాథ మహాకవి భీమఖండమునందు

క॥ పరమాశించును భీమే
శ్వరు ననుమతిజేసి చోడవంశాభరణుం
డరికాలుడు, కరికాలుడు
ధరణీధరపత్ని మనసు—ద్దైన్యమునందన్

అని యున్నది. ఆ అరికాలుడు, కరికాలుడుఅను బిరుద ములు కలవాడు మొదటి కులోత్తుంగచోళుడు. అతనికి 'రాజేంద్రచోడుడు'అను నామాంతరము కలదు. అతని మనుమడు రెండవ కులోత్తుంగచోడుడును ఆ (తాత బిరుదములనే) బిరుదులతోనే చోళరాజ్య మేలెను. అతని కాలము క్రీ. శ 1143 మొదలు 1158 అయి యున్నది. ఈ శాసనమును ఆకాలమందే పుట్టబడినది. అప్పటికి బేట విజయాదిత్యవంశ (తూర్పు చాళు క్యులు) మందలి 'మల్లపదేవుడు' 1147 మొదలు 1158 వరకు సాగరనిషయమును జననాథనగరి రాజ ధానిగా నేలెను. ఈ జననాథనగరిరాజులైన బేట విజయాదిత్యవంశరాజులకు చక్రవర్తియైన ఈ రెండవ కులోత్తుంగచోళ చక్రవర్తియే (తన వంశాంతర్గతు లగు) మల్లపదేవవిష్ణువర్ధనునిపై దండెత్తిన పశ్చిమచాళుక్యుల జయించి ఆ మల్లపదేవుని వేంగీ రాజ్యాధిపతిని గావించినపుడాతని యేలుబడిలోనుండి మండలాధిపతియగు శ్రీ భీమేశ్వరునకు సన్నిహితమైన యీ గ్రామమును తన పేరుతో 'చోడవరమ'నుపేరున శ్రీ భీమేశ్వరునకు దానముచేసెను. ఆ విషయమునే శ్రీనాథకవి పెద్దలుచేసిన కాలనిర్ణయమగు క్రీ. శ. 1455 యువకు పూర్వమే అనగా క్రీ. శ. 1400 ప్రాంతమందే యీ పద్యమును శ్రీ భీమేశ్వర పురాణ మందు వెలయించిన ప్రామాణికుడయ్యెను. ఇట్లెన్ని విధముల యోజించినను ఈ చోడవర శిలా శాసన కాలము శా. శ. 1077 యువకాని 1377 యువ కాదని నొక్కివక్కాణింప వీలుగలుగుచున్నది.

---

# ది రోడ్

## శ్రీ పి. కేశవరెడ్డి

(గత సంచిక తరువాయి)

### 3

ఒంటిల్లు అగ్రహారంలోని ఒక రైతు ఇంట్లోని ఆవుకు జబ్బు చేసింది. రైతు మొదట నాటు వైద్యంచేసి చూశాడు. తరవాత పశుగణాభివృద్ధి కేంద్రంలోని పశువుల డాక్టరును పిలుచుకొచ్చి చూపించాడు. అప్పటికి ఆవు తన నాలుగుకాళ్లపైన నిలబడి రెండునెల లయింది. ఆవును పరీక్షించిన డాక్టరు జబ్బు నయమయ్యే సూచన లేవీ లేవని తేల్చి చెప్పేశాడు.

ఆశ వదులుకున్న రైతు మాలపల్లికి కబురు పెట్టాడు. 'ఇయాల పెద మాంసం రో. బోడిరెడ్డిగారి కర్రావు సచ్చింది.'అంటూ ఒకరికొకరు చెప్పుకుంటూ సంబరపడ్డారు హరిజనులు. వారంతా కలిసి అగ్రహారానికి వచ్చారు.

రైతుభార్య పసుపుచల్లిన బట్టను ఆవుమీద కప్పింది. తలవద్ద కర్పూరం వెలిగించి, దండంపెట్టుకుని వెనుదిరిగింది. హరిజనులు ఆవుకాళ్లను ఒకటిగ చేర్చికట్టి, కాళ్లమధ్య పొడగాటి వెదురుబొంగును దూర్చి, భుజాలమీద మోసుకునిపోతుంటే రైతు భార్యకు కడుపులో దేవినట్లయింది. దాని పగ్గం పట్టుకుని ఆమె గనిమలవెంబడి మేపుతూ ఉండేది. ప్రత్తిగింజలను నానవేసి కుడితిపెట్టేది. ప్రతి శుక్రవారం దాని గిట్టలమీద, నుదుటిమీద పసుపుపూసి కుంకుమపెట్టి పూజలుచేసేది.

నాయకుడు ముందు నడుస్తుండగా మిగిలిన హరిజనులు ఆవును మోసుకుంటూ అతని వెనక నడుస్తున్నారు. నాయకునిపేరు కుట్టిగాడు. మాలపల్లిలోని బహుకొద్ది అక్షరాస్యులలో అతడొకడు.

ఆ బృందం చీకిరాళ్లతోపులోకి ప్రవేశించింది. వారు నడుస్తుంటే ఎండిన మర్రిఆకులు కాళ్లకింద బడి పళపళ నలుగుతున్నాయి.

వాళ్లు తూకాలబండమీద ఆవును దించారు. రెండు బండలసందున జానెడెత్తు గడ్డి పెరిగిఉంది. ఆవు వదులుతున్న ఉచ్ఛ్వాస నిశ్వాసములకు అనుగుణంగా ఆ గడ్డి కదులుతూఉంది. ఒకడు చీపురు తీసుకుని బండను శుద్ధిచెయ్యసాగాడు. బండమీద ఎర్రటిమరకలు అస్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ మరకలు గతవారం ఇక్కడ వధింపబడిన దున్నపోతు యొక్కరక్తపు మరకలు. బండప్రక్కన ఉన్న ఈత పొదలలో రాసిగా పడిఉన్న ఎముకల విషయమై ఊర కుక్కలు కాట్లాడుకుంటూ ఉన్నాయి.

కుట్టిగాడు గోచిబిగించి కట్టుకుని,' కుంటోడా గడ్డపార ఇలా అందుకో' అన్నాడు.

కుంటోడు గడ్డపలుగును అందించి, 'కుట్టిమాఁవా, ఈ సుట్టుపట్ల గామాల్లో యాడాలేనిరోగం మన బోడ్రెడ్డిగారి ఆవుకు ఎలా వచ్చిందంటవు ?' అనడిగాడు.

కుట్టిగాడు గునపాన్ని ఆవు నుదిటికేసి గురి చూస్తూ,' 'బోడ్రెడ్డి పెండ్లాం జంగపోనికి కొంగు వేస్తాంది కదు. తిరపతి గంగమ్మకు కోపమొచ్చి ఆవును మింగేసిందేమో. ఐనా మనకెందుకు అవన్నీ. ఆవు ఏనుగులాగ ఉంది. వీశెడు కొవ్వుపడుతుంది. పదిసేర్లు నెత్తురు పట్టవచ్చు. అది చాలదా?' అన్నాడు.

'వీశెలూ శేర్లు లెక్కపెట్టుకుంటే సరిపోతుందా. ఈ మాంసాన్నితింటే వాళ్ళు ఏమవ్తుతుందో ఆలోచించుకో నక్కరలేదా?' అన్నాడు సుబ్బారాయుడు బండమీదికి ఎక్కివస్తూ. రోడ్డు నిర్మాణ పథకాన్ని హరిజనులకు వివరించిచెప్పి, వారిని కార్యోన్ముఖులుగా చేయడానికి సుబ్బారాయుడు నిన్నటినుంచి ప్రయత్నిస్తున్నాడు. వారందరను ఒకచోటగా కలుసుకోవడానికి తూకాలబండకన్న మెరుగైన చోటు అతనికి లభించ లేదు.

కుట్టిగాడు చేతిలోని గునపాన్ని క్రిందకు దించాడు. అతడు వెనుదిరిగిచూసి, 'నువ్విట్టా సుబ్బా రాయుడూ. చేసేది శివపూజ—కుడిచేది మాలకూడు అన్నట్టుంది నీ వ్యవహారం. పటాలంలో దినమూ రాత్రీ ఎద్దుమాంసం మెక్కులావు. ఇక్కడమాత్రం సుద్దులు చెప్తావు' అన్నాడు

సుబ్బారాయుడు ఆవుకేసి ముఖం చిట్లించి చూసి, 'ఇలాంటి పుచ్చిపోయిన గొడ్లను, చచ్చిపోయిన గొడ్లను పటాలంలో వాళ్లు తినరు. పరిపూర్ణమైన ఆరోగ్యంతో ఉన్నవని డాక్టర్లచేత సర్టిఫై చేయ బడిన ఎద్దులమాంసాన్నే తింటారు.' అన్నాడు.

కత్తులకు పదును పెడుతున్న కుంటోడు, 'మిమ్మల డాక్టట్లు కాస్తే మమ్మల తిరపతిగంగమ్మ కాస్తదిలేరా రాయుడూ' అన్నాడు.

చీపురుతో బండను శుభ్రం చేస్తున్నవాడు, 'మ్మరే అంతేగదా' అన్నాడు.

కుట్టిగాడు గునపాన్ని పైకిఎత్తి, 'తిరపతి గంగమ్మా, పాలోపాలి' అంటూ ఆవు నుదుటిమీద బలంగా మోదాడు.

అంబాఅని అరచి నాలుకను బయటికి చాచింది ఆవు.

దాపునఉన్న మద్దిమాను కొమ్మలకు వ్రేలా డుతూ ఉండిన కబోదిపిట్టలు రెక్కలు టప టప లాడిస్తూ లేచి నలుదిక్కులకు పారిపోసాగాయి. అవి బావురుపిల్లి నోట్లో నలిగిపోతున్నట్లు ఆర్తనాదాలు చేశాయి.

ఆవు వదులుతూఉన్న ఉచ్ఛ్వాస నిశ్వాసాలకు అనుగుణంగా చలిస్తూఉండిన నెరియలోని గడ్డి ఇప్పుడు నిశ్చలంగాఉంది. దాని కనుగ్రుడ్లు గాజు పెంకుల్లాగ ఉన్నాయి. వాటిపైన ఈగలువాలినా కను రెప్ప లల్లాడడంలేదు.

కుంటోడు ఆవు ముక్కువద్ద చేయిపెట్టి చూసి, 'కుంటిమాదు చేతిపెట్టంటే సామాన్నేమా. ఒక దెబ్బకే సచ్చిపొయ్యింది' అన్నాడు.

కుంటోని పొగడ్తను కుట్టిగాడు సరకు చెయ్య లేదు. అతడు కత్తివాదరను గోటిపైఉంచి దాని పదునుచూసి, 'అది సరేగాని రాయుడూ, మాలపల్లికీ అగ్రహారానికీ రోడ్డు వేయబోతున్నారటగదా. ఏమా కథ?' అనడిగాడు.

తాను ప్రస్తావించదలచిన విషయాన్ని అతడే ప్రస్తావించినందుకు సుబ్బారాయుడు సంతోషించాడు. 'ఆ విషయాన్నిగురించి మీ కందరకూ చెప్పడానికే ఇక్కడికొచ్చాను' అన్నాడతడు.

చాకుతో ఆవుపొట్టమీద చర్మాన్ని వొలు స్తున్న కుంటోడు తలనైనా ఎత్తకుండా, 'నువ్వు సెప్పేదేంది—మేం వినేదేంది. అగ్గురారపోళ్లు రోడ్డు ఏసిన్నాటికి దానిమీద మనమంతా నడుత్తాం అంతే' అన్నాడు.

'రోడ్డునంతా అగ్రహారీకులే వేయబోవటం లేదు. మనమంతా కలిసి మట్టిరోడ్డు వెయ్యాలి. తరవాత అగ్రహారీకులు చందాలు వేసుకుని పైకం సేకరించి రోడ్డుకు కంకరవేస్తారు' అన్నాడు సుబ్బారాయుడు.

పొట్టమీద చర్మాన్ని వొలవడం పూర్తిచేసిన కుంటోడు తలయెత్తి, 'ఐతే మా దగ్గిరకూడ చందాలు వసూల్జేస్త నంటావా?' అనడిగాడు.

'మనవద్దనుండి ధనసహాయం ఎవరూ ఆశిం చడం లేదులేరా కుంటోడా. కాని మనం శ్రమదానం చెయ్యడానికి సిద్ధంగా ఉండాలి' అన్నాడు సుబ్బా రాయుడు.

కుంటోడు చాకును అవతలబెట్టి, 'ఏటేటి? సెమదానమంటే ఏటది?' అనడిగాడు.

'అంటే ప్రతిఫలాన్ని ఆశించకుండా పని చెయ్యడమన్నమాట. మన మాలపల్లిలో ముప్పై ఇళ్లున్నాయిగదా. ఒక్కొక్క ఇంటినుంచి ఒక్కొక్కడు బయలుదేరి, ఇరవైదినాలు పనిచేస్తే మట్టిరోడ్డు తయారవుతుంది. ఆ విధంగా మనం మన శరీర కష్టాన్ని దానం చేస్తున్నామన్నమాట' అన్నాడు సుబ్బారాయుడు.

ఆ మాటలను కళేబరంచుట్టూఉన్న ముప్ఫయ్ మంది హరిజనులు విన్నారు. వారు తమతోబాటుగ తలా ఒక పాత్రను తెచ్చుకున్నారు. వాళ్లు ఆవు మాంసాన్ని ముప్పైభాగాలుగ విభజిస్తారు. ప్రతి

ఒక్కడు తన వాటామాంసాన్ని ఆ పాత్రలో వేసుకుని పట్టుకుపోతాడు.

చర్మాన్ని వొలిచివేయడంతో ఎర్రటికండరాలు ఎండలో నిగనిగ మెరవసాగాయి. రాబందులు ఆకాశంలో వలయాలు తిరగడం ప్రారంభించాయి. వాటి నీడలు కళేబరంమీద ప్రాకుతున్నాయి.

కుట్టిగాడు ఆవుకాళ్లను గొడ్డలితో నరుకుతూ, 'ఇందులో మనం 'దానం' చెయ్యడమేముంది రాయుడూ. మన రోడ్డును మనం వేసుకుంటున్నాం అంతేగదా' అన్నాడు.

హరిజనుల నాయకుడైన కుట్టిగాడు అలా అనడంతో సుబ్బారాయునికి చాల సంతోషమయింది. 'ఐతే రోడ్డుకోసం పనిచేయడానికి మీరంతా సిద్ధమన్నమాట' అన్నాడతడు.

'ముమ్మాటికీ, ఇరవైరోజులేం ఖర్మ నెలరోజులైనా పనిచేయడానికి సిద్ధం. మాలపల్లికీ అగ్రహారానికి రోడ్డు పడితీరాలిసిందే' అన్నాడు కుట్టిగాడు.

ఆనందంతో సుబ్బారాయుడు ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. హరిజనులలోఉన్న కార్యదీక్షకు అతడు మురిసిపోయాడు. రోడ్డు పూర్తిఅయినట్లు, దానిమీద హరిజనులు, అగ్రహారీకులు కలిసి నడుస్తున్నట్లు అతని కన్నులకు తోచింది.

ఆకాశంలో వలయాలు తిరుగుతున్న రాబందు క్రిందికి దిగి సుబ్బారాయుని తలమీదొక తన్నుతన్ని రివ్వున ఎగిరిపోయింది. అది చూసి గోచికూడా లేకుండా తిరుగుతున్న కుర్రవాడు పకపక నవ్వాడు.

అలా నవ్వుతున్నవానివైపు కుట్టిగాడు కనుబొ్రరజేసి చూసి, 'మాదిగోనికి పుట్టినోడా. వడిసెల తీసుకుని గద్దల్ని తరిమికొట్టకుండా నిలుచుని నవ్వుతున్నావా?' అన్నాడు. వాడు వెంటనే వడిసెల తీసుకుని రాబందులకేసి గురి చూడసాగాడు.

కుంటోడు చెవిలో ఉంచుకునిఉన్న బీడీని నోట్లో పెట్టుకుని, 'రోడ్డెయ్యటానికి అగ్గురార పోళ్ళే ముందు పడతాఉంటే మనం మూలకూర్చోవడం మంచిదికాదు' అన్నాడు.

'అగ్రహారీకులు చాల పెద్దమనసు గలవారు. మాలపల్లిని పైకి తీసుకు రావటానికి వారెప్పుడూ కృషిచేస్తుంటారు. ఒక అగ్రహారీకులే కాదు. మన ప్రభుత్వంకూడ హరిజనాభ్యుదయానికి నిర్విరామంగా కృషిచేస్తూంది. కళాశాలలలోను, ఉద్యోగాల ఎన్నికలోనూ మనకు ప్రత్యేక అవకాశాలు కల్పిస్తూంది. మన క్షేమంకోసం కోటానుకోట్ల ధనం వ్యయం చేస్తూంది. మనంకూడ కొంత చొరవను, ధైర్యాన్ని ప్రదర్శించి ప్రభుత్వం కల్పిస్తున్న అవకాశాలను సద్వినియోగం చేసుకోవాలి' అన్నాడు సుబ్బారాయుడు.

కుర్రవాడు వడిసెలను గిరగిరత్రిప్పి ఆకాశంలో వలయాలు తిరుగుతున్న రాబందుకేసి గురిచూసి కొట్టాడు. రాబందు గాలిలోనే కార్‌మనిఅరచి పల్లటీలు కొడుతూ కొంతదూరం ఎగిరి, అల్లంతదూరాన ఉన్న చెరువులో పడిపోయింది. దాన్నిపట్టి తెచ్చేందుకై కుర్రాడు పరుగెత్తాడు.

కుట్టిగాడుగూడ బీడీ నోట్లో పెట్టుకుని అగ్గిపెట్టెను కుంటోనివద్దనుండి తీసుకుని, 'ఐతే రోడ్డుపని ఎప్పుడు మొదలయ్యేట్టు?' అనడిగాడు.

'వచ్చే సోమవారం మహాత్మాగాంధీగారి శతజయంతిదినం. ఆ పర్వదినాన్నే రోడ్డుపని ప్రారంభించాలి' అన్నాడు సుబ్బారాయుడు.

కుంటోడు బీడీపొగ వదులుతూ, 'ఆ రోజే ఎందుకు మొదలుపెట్టాలి?' అనడిగాడు.

'ఆ రోజు గాంధీగారు పుట్టినదినం. గాంధీ మహాత్ముడు హరిజనాభ్యుదయానికై జీవితాంతం కృషి చేశాడు. ఆయన మాలవాళ్ల ఇళ్లలో కాపురమున్నాడు. మాలవాడిచేతికూడు తిన్నాడు. కనుక మాలపల్లికి ఉపయోగకారియైన కార్యాన్ని గాంధీ జయంతినాడే ప్రారంభించదలిచాం' అన్నాడు సుబ్బారాయుడు.

ముక్కులోనుండి నెత్తురోడుతున్న రాబందును బరబర లాక్కొచ్చాడు కుర్రవాడు. వాడు దానిని బండప్రక్కన పడవేసి దాని ఈకలు పీకసాగాడు.

'మనందరకు హరిజనులని పేరుపెట్టినవాడు మహాత్ముడే. మీకు తెలియదేమోగాని ఆయన ఒక మాలపిల్లను పెంచుకుంటూ ఉండేవాడు' అన్నాడు సుబ్బారాయుడు.

'గాంధీమహాత్ముడు ఈనాటిదాక బతికిఉంటే దేశం ఏమై ఉండును?' అనడిగాడొకడు.

'ఆయన బతికిఉంటే ఈ సమాజం ఇలా ఉండేదికాదు. మాలమాదిగలనే భేదభావాలన్నీ నశించి ఉండేవి—' అన్నాడు సుబ్బారాయుడు.

కుట్టిగాడు మధ్యలో అందుకుని, 'కుంటోని కొడుక్కు మునసబుగారి కూతురును తీసుకుని ఉందురు. దాసప్పకూతురును కరణంగారి కొడుక్కు ఇచ్చిఉందరు' అన్నాడు. అతనితోబాటు అందరూ ఘొల్లున నవ్వారు. అతిగా నవ్వడంవల్ల కుట్టిగానికి పలకమారింది. వాడు విపరీతంగా దగ్గసాగాడు. కుంటోడు అతని గొంతుకమీద తీడుతూ, 'కుట్టి మావను సుట్టాలు ఎవరో తల్సుకుంటూ ఉండారు' అన్నాడు.

దగ్గునుంచి తేరుకున్నాక కుట్టిగాడు, 'అది సరేగాని రాయుడూ. గాంధీగారుపోయి ఇన్నేండ్లయింది గదా, ఆయన ఆశించిన హరిజనాభ్యుదయం ఇంకా సాధింపబడక పోవడానికి ఏమిటి కారణం' అనడిగాడు.

అది చాల గడ్డుప్రశ్నగా సుబ్బారాయునికి అని పించింది. 'కారణాలు కొల్లలుగా ఉన్నాయి. అవన్నీ తరవాత చర్చించుకుందాం' అంటూ ఆ గడ్డుప్రశ్నను దాటవేసి, 'ఇంతకూ మీరందరూ రోడ్డుకోసం పని చెయ్యడానికి సిద్ధమేగదా' అనడిగాడు అందరివైపు చూస్తూ.

'మేమందరమూ సిద్ధమే. కూలీనాలీ మానుకు నైనా రోడ్డుపనికి వస్తాం.' అని కళేబరం చుట్టూ ఉన్న ముప్ఫైమంది ఏకకంఠంతో అన్నారు.

* * *

రోడ్డు నిర్మాణానికి హరిజనులు చూపుతున్న ఉత్సాహాన్ని సుబ్బారాయుడు మాస్టారుగారికి విని పించాడు. తనవారిలో ఇంతటి 'చేవ' ఉన్నదని చెప్పుకోవడానికి అతడు గర్వపడ్డాడు. 'మాస్టారూ. మట్టిరోడ్డును మా వాళ్లు చూస్తుండగానే వేసే స్తారు. తరవాత దానిని కంకరచేసే బాధ్యత మీ అగ్ర హారీకులు ఎంతవరకు నిర్వహిస్తారో మరి' అన్నా డతడు మాస్టరుగారిపై పందెం కాస్తున్నట్లు.

పందెంలో వీగిపోతానేమోనని మాస్టరుగారు ఇంచుక భయపడ్డాడు. అతడు వెంటనే చందాలకై బయలుదేరాడు. అగ్రహారంలో అరవై రైతుకుటుంబా లున్నాయి. అందులో ఎక్కువమంది ఏదో ఆ పూట కాపూటగా గంజితాగ గలుగుతున్న కుటుంబాలే. ఆ కుటుంబాలనుండి పిల్లలు చిరిగిన చొక్కాలతోనూ, అతుకుల పావడాలతోనూ బడికి వస్తుంటారు. ఆ వేషంలో బడికి రాకూడదని అతడు అనలేకపోయే వాడు. అంతకన్న మెరుగైన బట్టలు ధరించే తాహతు వారికిలేదని అతనికి బాగా తెలుసు. ఆ పిల్లలు పుస్తకాలను, పలకలను సకాలానికి కొనరు. కొందరు అసలే కొనరు, ఆ కారణంగా వారిని అతడు బడినుండి పంపివేస్తే వారు బడివెనక మారేడుచెట్టు నీడన ఏడుస్తూ కూర్చునేవారు. పిల్లలకు కనీసావ సరాలయిన పలకా బలపంకూడ కొనిపెట్టలేని స్థితిలో తల్లిదండ్రులున్నారని తెలిసినప్పుడు మాస్టరుకు వారిపై ఎంతో జాలికలిగేది.

ఊళ్లో వారందరకు మాస్టరుగారిపై భక్తి శ్రద్ధలు మెండు. తత్కారణం వల్లనైతేనేమి, రోడ్డు ఆవశ్యకతను గుర్తించడంవల్లనైతేనేమి మాస్టరుగారు అడగగానే వారు తమ శక్త్యనుసారం విరాళాలిచ్చారు. మూడు రోజులలో ఆరువందల రూపాయలను మాస్టరు సేకరించాడు.

మరుదినమే అతడు క్వారీ మేనేజరును కలుసు కుని పది యూనిట్ల కంకరకోసం ఆర్డరిచ్చాడు. యాభై రూపాయలు అడ్వాన్సుగా ఇచ్చాడు. రోడ్ రోలరుకోసం ఇరవై రూపాయలు అడ్వాన్సు డబ్బును విలేజిలెవల్ వర్కరుద్వారా పంపించాడు.

## 4

ఆరోజు గాంధీ శత జయంతిదినం. రోడ్డు నిర్మా ణానికి ప్రారంభోత్సవం ఆరోజే జరగనున్నది. ఆ ప్రాంతంలో పేరుమోసిన సంఘసంస్కర్త శ్రీ ఈశ్వరయ్యగారు ప్రారంభోత్సవంచేసి, ఉపన్యాసం ఇవ్వనున్నారు.

అగ్రహారంలో చివరిఇల్లు కరణంగారిది. మాల పల్లిలో మొదటి ఇల్లు దాసప్ప గుడిసె. ఆ రెండి ళ్ళకు మధ్య చీకిరాళ్ళతోపుగుండా సన్నని కాలిబాట ఉంది. అగ్రహారానికి మాలపల్లికి మధ్య ప్రస్తుతం

ఉన్న ఒకేలంకె ఆ కాలిబాటే. ఆ కాలిబాటనే కంకర రోడ్డుగా మార్చనున్నారు.

కరణంగారింటికి సమీపాన వేదిక నిర్మించారు. బడిలోని బల్లలనుతెచ్చి ఒకదానిప్రక్కన ఒకటిపెట్టి ఆవేదిక నిర్మించారు. వేదికమీద కొబ్బరాకుల పందిరి ఉంది. పందిరికి మామిడాకుల తోరణాలు వ్రేలాడుతున్నాయి. ఆ పందిరి ఉదయపుటెండలో పచ్చదనాల నీనుతూ, పచ్చివాసనల వెదజల్లుతూ శోభాయమానంగా ఉంది.

అగ్రహారీకులు, హరిజనులు తిరణాళ్ళకు విచ్చేసినట్లు వచ్చిచేరారు. వారు రంగులీనే బట్టలతోనూ, ఉత్సాహంపొంగే ముఖాలతోనూ ఉన్నారు. మగవాళ్ళు సరిగంచుతువ్వాళ్ళు తలలకు చుట్టుకున్నారు. ఆడవాళ్ళు సిగనిండా పూలు పెట్టుకున్నారు. కుర్రవాళ్ళు కొబ్బరాకులతో బాకాలుచేసి ఊదుతున్నారు.

తలగుడ్డ చుట్టుకున్న వాడొకడు, 'ఈశ్వరయ్యగారి అసలుపేరు ఈశ్వరరెడ్డిగారట. పుట్టడానికేమో గొప్పవంశంలోనే పుట్టారుగాని ఆయన మాలల లోనే కలిసిపోయాడు' అన్నాడు.

'గాంధీలాంటి వారన్నమాట.'

'ఆయన గాంధీగారి శిష్యుడే. ఆస్తిపాస్తులనంతా మాలవాళ్ళకే అర్పించేశాడు—'

వారి ముందున్నవాడు వెనకకు తిరిగి, 'సద్దు సెయ్యకండెస. అయ్యగారొస్తున్నారు' అన్నాడు.

జనంలో నిశ్శబ్దత వ్యాపించింది. ఒకరిభుజాల మీద మరొకరు నిక్కి చూడసాగారు. కుర్రవాళ్ళు కొబ్బరాకు బాకాలమీద తాము చేస్తూఉండిన సంగీత సాధన చాలించారు.

ఈశ్వరయ్య కనిపించగానే జనం చేతులెత్తి దండంపెట్టారు. అతని కుడివైపున మాస్టరు, ఎడమవైపున సుబ్బారాయుడు నడిచివస్తున్నారు. రోడ్డు ప్రారంభమయ్యేచోట ఈశ్వరయ్య కర్పూరం ఉంచి వెలిగించాడు. వెలుగుతున్న జ్యోతికి జనం నమస్కరించారు. మాస్టరు కొబ్బరికాయ పగలగొట్టాడు. ఈశ్వరయ్య నడుంవంచి పారతో మూడుసార్లు మట్టిని తీసి ప్రక్కనున్న తట్టలో వేశాడు. జనం హోరుమని కరతాళధ్వనులు చేశారు. సుబ్బారాయుడు తట్టలోని మట్టిని కాలిబాటమీద పోశాడు. ఈశ్వరయ్య మట్టిని తవ్వుతుండగా మాస్టరు తన మెడలోని కెమీరాతో ఫోటోలుతీశాడు.

తరవాత వారు ముగ్గురూ వేదికమీదకు నడిచి ఉచితాసనాల నలంకరించారు. మాస్టరుగారు లేచి, ఈశ్వరయ్యగారిని పరిచయంచేసి వారి హరిజనసేవా నిరతిని క్లుప్తంగా వివరించారు.

తరువాత ఈశ్వరయ్యలేచి, 'రైతుబిడ్డలారా! హరిజన సోదరులారా!' అంటూ తన ఉపన్యాసాన్ని ప్రారంభించాడు.

వెనకనున్న జనమంతా ముందుకు కదిలారు. వాళ్ళు వొడలెల్ల చెవులుచేసుకుని వినసాగారు.

'ఈ దినం భారతీయులందరుకూ పర్వదినం. ఒక్క భారతదేశమే గాదు, యావత్ప్రపంచంచేత పర్వదినంగా పరిగణింపబడిన సుదినమిది.

ఈ దినాన్నే ఈరోడ్డు నిర్మాణాన్ని ప్రారంభించడం చాల ముదావహం. పతితులు, దీనులు, అల్పసంఖ్యాకులు అయిన హరిజనులకోసం మహాత్ముడు జీవితాంతం పోరాడాడు. సంఘంలో హరిజనులకు సమాన హక్కులు అవకాశాలు లభించనంత వరకు, బ్రిటిషువారినుండి మనం సంపాదించిన స్వాతంత్ర్యానికి అర్థంలేదని మహాత్ముడు పేర్కొన్నాడు. మహాత్ముడు సాధించిన రామరాజ్యంలో హరిజనులనీ, అగ్రజాతులవారనీ భేదాలుండవని ఆశించాం. కాని నేడుమనం చూస్తున్న పరిస్థితి ఎలాంటిది. హరిజనులకోసం రోడ్లువెయ్యటం, బావులుత్రవ్వటం లాంటి అభ్యుదయ కార్యక్రమాలు అక్కడక్కడ కనిపిస్తే కనిపించవచ్చుగాని, వారు మానసికంగా శారీరకంగా ఎన్ని చిత్రహింసల పాలవుతున్నారో మీకంతా తెలుసు. ఈ విషయం ఏ గ్రామచరిత్రను కదిపినా బయటపడుతుంది. నిరక్షరాస్యతలో హరిజనులు మునిగి తేలుతున్నారు. వారిచేత అగ్రజాతులవారు చేయరాని పనులు చేయిస్తున్నారు. అరవచాకిరి చేయించుకుని వారి కడుపులు మాడబెడుతున్నారు. వారి అసమర్థతను, అజ్ఞానాన్ని ఆధారంగా చేసుకుని వారిని అమానుష చర్యలకు గురిచేస్తున్నారు—'

అతనిమాటలను జనం మంత్రముగ్ధులై వింటున్నారు. సమావేశానికి ప్రక్కనఉన్న చింత

చెట్టుకింద టీకొట్టుపడుచు తాత్కాలికమైన సోడా అంగడి తెరచింది. రంగు రంగుల సోడాసీసాలు తొట్లలో అమర్చబడిఉన్నాయి. అందరూ ఉపన్యాసంలో లీనమైపోయి ఉన్నారు గనుక ఆమెవద్ద సోడాలు తాగ డానికి ఎవ్వరూ రావడంలేదు. ఆమె ఒకనిమ్మకాయను తన అరచేతులమధ్య దొర్లిస్తూ ఉపన్యాసాన్ని వింటూంది. కాని ఆమెకు ఉపన్యాసం నచ్చలేదు. ఆర్. టి. సి. బస్సులో వచ్చే డ్రైవరుచెప్పే తియ్యటి కబుర్లను మననం చేసుకుంటూ ఉందామె. ఆ డ్రైవరు ఇవాళ పువ్వులరవికె తెస్తానన్నాడు. సమ యానికి తాను అంగడిలో లేకుంటే అతడు నిరాశ జెందుతాడేమో.

ఈశ్వరయ్యగారి కంఠం ఖంగున మ్రోగుతూ ఉంది. '—మహాత్ముని అనుయాయులు కొల్లలుగ ఈ దేశంలో ఉన్నారు. కాని హరిజనాభ్యుదయం ఆశించినంతగా జరగకపోవడానికి ఏమిటి కారణం?'—

ఆ ప్రశ్న అందరి మనసులలోను గుచ్చు కుంది. అది వారిని కలతపెట్టింది. అగ్రహారీకులు న్యాయస్థానంలో ముద్దాయిలులాగ తలలువంచు కున్నారు. వారిలో చాలమంది హరిజనులను అణగ దొక్కడంలో పాల్గొన్నవారే. ఒక రైతు తన పొలంలో మిరపకాయలను దొంగిలించిన హరిజనుడ్ని పట్టుకొచ్చి కొబ్బరిపీచు దారాలతో ఆ పాదమస్తకం బంధించి చెరువుకట్టమీద పడదోశాడు. బొక్కెనతో చెరువు లోని నీళ్లుతెచ్చి దారాలమీద పోశాడు. నీళ్లుపోసేకొద్దీ తాళ్లు బిగుసుకుని కత్తుల్లాగ శరీరాన్ని కోశాయి. బాధకు తాళలేక వాడుపెట్టిన కేకలకు భయపడి చెరువులోని నీటిపకులన్నీ చెల్లాచెదురుగా పరు గెత్తాయి. ఆ దారినపోతున్న హరిజనులుగాని, అగ్ర హారీకులుగాని రైతును ఆపడానికిగాని, తాళ్లువిప్ప డానికిగాని ప్రయత్నించలేదు. పైగా కొంతమంది, 'అలా వాట్టి నీళ్లుపోస్తే చాలదు. పేడకలిపిన నీళ్లు పోస్తే తొందరగా తాళ్లు బిగుసుకుంటాయి. బాగ బుద్ధివస్తుంది.' అన్నారు. సాయంత్రం తాళ్లు విప్పుతున్నప్పుడు తాళ్లతోబాటు చర్మంకూడ లేచిరాసాగింది. బాధకు వోర్చుకోలేక వాడు నాలుక బయటపెట్టి నోటితోగాలి పీల్చుకున్నాడు.

ఇంకొక రైతు పొలం దగ్గరున్న అయిలు ఇంజనులోనుండి కొన్ని భాగాలను కాజేశాడన్న నెపంతో ఒక హరిజనుడిని పట్టుకుని, కాలుచేతులు కట్టివేసి, బోర్లపడదోసి ఎర్రగకాలిన ఇనుపకడ్డీతో వీపునంతా కాల్చివేశాడు. బాధతాళజాలక వాడు పెడ బొబ్బలుపెడుతూ అలాగే మూర్ఛపోయాడు. మూర్ఛ తేరాక వాడు అగ్రహారపు వీధుల వెంబడి దేకుతూ వెళ్లి మాలపల్లి చేరుకున్నాడు. వానివీపుమీద వ్రేలాడుతున్న సగం సగం కాలిన కండరాలను చూడ లేక అందరూ కళ్లు మూసుకున్నారు.

'—స్వాతంత్ర్యమన్నది ఒకరు మరొకరికి ప్రసాదించేదిగాదు. దానిని ఎవరికి వారు పోరాడి సంపాదించుకోవాలి. నిజానికి ఆనాడు గాంధీ మహాత్ము డిని కలవరపెట్టింది బ్రిటిషువారి పరిపాలనగాదు. మనవారిలో బలిసిపోతున్న పరావలంబనను చూసి అతడు ఖిన్నుడయ్యాడు. నాడు మహాత్ముడు అసహ్యించు కున్న పరావలంబన ఇంకా ఈనాటి హరిజనులలో పాదుకొని ఉన్నదనడానికి నేను సాహసిస్తున్నాను. తామూ మనుషులమేనని, తమ శరీరంలోనూ చీము నెత్తురులున్నాయని వీరు మరచిపోతున్నారు. మరచి పోయి తమంతతాముగా అగ్రజాతులవారికి బానిసలయి పోతున్నారు. పురుగులు దుర్గంధంలోనే మహదానంద మనుభవిస్తున్నట్లు, వీరూ బానిసత్వంలో తృప్తిపడు తున్నారు. ఈ దాస్య శృంఖలాలను తెంచుకోవడానికి వీరు ప్రయత్నించడం చాల అరుదు. ధనము అధి కారము కలిగిన వారు తమను ఎన్ని అమానుష కృత్యా లకు గురిచేసినా, తమను ఆయుధాలుగా వాడుకొని ఎన్ని అకార్యాలు చేయించినా—అదేమని అడిగేలేని జడత్వం వారిలో వ్యాపించింది. మన సమాజంలో హరిజనాభ్యుదయాన్ని సాధించడానికి ఈ జడత్వ మొక ప్రతిబంధకమని నాకు గోచరిస్తూంది—'

వేదికమీద వక్తప్రక్కన కుర్చీలో సుబ్బా రాయుడు తలవంచుకుని కూర్చుని ఉన్నాడు. ఉపన్యా సాన్నివింటూ అతడు టేబిలుమీద బొటనవేలు గోటితో గీస్తున్నాడు. అతనికి తెలియకుండానే గోరు టేబిలుమీద దాదాపు అరఅంగుళానికి దిగబడుతూ ఉంది. అతని నరాలన్నీ బిగుసుకుంటున్నాయి.

ఈశ్వరయ్య చెప్పేది నిజం. అగ్రహారీకుల చేతులలో హరిజనులుపడే అవమానాలు ఇన్నీ అన్నీ కావు. మాలవాడు అగ్రహారపు వీథులలో నడుస్తు

స్పృశ్యుడు తనకాలిలోని చెప్పులనుతీసి చేతబట్టుకోవాలి. రెడ్డిగాని నాయుడుగాని ఎదురైతే తలపాగాను తీసి వేయాలి. హరిజనుడు దేవుడిని ప్రార్థించాలంటే గుడిచుట్టూఉన్న ప్రాకారానికి వెలుపలనుండే పూజించాలి. ప్రాకారానికి వెలుపలనే ప్రదక్షిణ చేయాలి. రోడ్డుప్రక్కన ఉన్న టీ కొట్టులో మాలవాళ్ళకు ప్రవేశంలేదు. వారికని ప్రత్యేకించబడిన గ్లాసు చూరులో చెక్కబడి ఎండకు ఎండుతూ వానకు నానుతూ ఉంటుంది.. ఇక డబ్బు దస్కంఉన్న మునసబులాంటివారు, హరిజనులచేత చేయించే దుండగాలు మూడోవ్యక్తికి తెలియవు. ఖూనీలు చేయించడం, ఇండ్లు తగలబెట్టడం, కుప్పలను కాల్చడం, పొలాల వద్దనున్న ఆయిలు ఇంజన్‌లను సమ్మెటలతో విరగగొట్టడం—ఎన్నో. లాము చేస్తున్న పనులలోని యుక్తాయుక్తాలను తెలుసుకోకుండా, తమ మనసును తనువును ధనబలం, జనబలం కలిగిన చిల్లర దేవుళ్ళకు విక్రయించుకుని వారు జడపదార్థాలుగా మిగిలిపోయారు.

సుబ్బారాయుడు గోటితో టేబిలుపైన గీస్తూ ఉన్నాడు.

పందిరి గుంజలకు కట్టబడియున్న అరటి చెట్లలోని ఆకులు ఎండకు కమిలి తలలు వాల వేస్తున్నాయి.

టీకొట్టు పడుచు టుష్‌టుష్ మని చప్పుడు చేస్తూ సోడాలను కొట్టసాగింది. ఉపన్యాసంలో లీనమైపోయిన కరణంగారికి సోడాకాయల చప్పుడు అంతరాయం కలిగించింది. అతడు వెనుదిరిగి, 'పిల్లా. నన్ను ఉపన్యాసం విననీకుండా ఇలాగే సద్దుచేస్తూ ఉన్నావంటే గుండువేసి నీ సోడాసీసాలను వరసపెట్టి పగలగొట్టేస్తాను' అన్నాడు.

ఆమె మరోసీసాను బొగ్గటి కానించుకుని టుష్‌మని కొట్టి, 'నువ్వెలాగూ పిసనారివి. పది పైసాలుపెట్టి ఒకసోడా తాగవు. తాగేవాళ్ళనైనా తాగనీయరాదా ?' అంది.

శ్రోతల నందరను ఆత్మపరీక్షకు గురిచేస్తూ ఈశ్వరయ్య మాట్లాడుతున్నాడు. 'వేదకాలంలో ఈ హరిజన వ్యవస్థలేదు. ఉపనిషత్తులలో హరిజనులు పేర్కొనబడలేదు. ఇది కేవలం స్వార్థపరులైన కొందరు స్వప్రయోజనం కొరకై సృష్టించిన వ్యవస్థ. ఇది పవిత్రమైన హిందూమతానికొక కళంకం. ఈ కళంకాన్ని కడిగి వేయవలసిన బాధ్యత మనందరిమీద ఉంది.

ప్రకృతిచేతను, సోదర మానవులచేతను అధః పాతాళంలోకి త్రొక్కబడిన జాతులు ప్రపంచంలో చాల ఉన్నాయి. ఒకప్పుడు నీగ్రోలతో తెల్లవారు పశువులతో వ్యవహరించినట్లు వ్యవహరించేవారు. పశువులను విక్రయించినట్లు వారిని బజారులో విక్రయించేవారు. ఆ నిమ్నజాతులవారు తమ హక్కులకోసం విప్లవాలురేపి, ఎడతెగని యుద్ధాలుచేసి జయించి స్వేచ్ఛా వాయువులు పీలుస్తుండడం మనం చూస్తున్నాం. ఒకప్పుడు అడుగున ఉండిన కూలిజనం మహత్తరమైన రాజకీయపార్టీని స్థాపించి ప్రపంచాన్ని గడగడ లాడిస్తుండడం చూస్తున్నాం.

అలాంటి చైతన్యం మన హరిజనులలో కానవస్తుండడం ముదావహం. ఈ రోడ్డును వేయడానికి హరిజనులు శ్రమదానం చేయనున్నారని విన్నప్పుడు నేను పొందిన ఆనందానికి మేరలేదు. వారిలో కలిగిన చైతాన్యానికి నేను గర్వపడ్డాను. ఇదే చైతన్యంతో, ఇదే కార్యదీక్షతో వారు అభివృద్ధిపథంలో సాగుతారని నేను ఆశిస్తున్నాను. నమస్తే.'

చేతులు జోడించి నమస్కారంచేస్తూ ఈశ్వరయ్య కూర్చున్నాడు. శ్రోతలుచేసిన కరతాళధ్వనులు సముద్రపు హోరులాగ వినిపించింది.

సుబ్బారాయుడులేచి వందన సమర్పణ చేశాడు. నీరెండతాకిడికి శోషిల్లిన వారంతా టీకొట్టుపడుచు దగ్గర సోడాలుకొని తాగడం ప్రారంభించారు. రొమ్ములమీదనుండి పైట జారిపోతుండడం కూడ గమనించకుండా, ఆమె తన హస్తలాఘవాన్నంతా ప్రదర్శిస్తూ, ఒకచేత్తో చిల్లరడబ్బులను తీసికొని ఖాళీన్యూట్రిన్ డబ్బాలో వేసుకుంటూ, మరోచేత్తో అందరికీ సోడాలు అందిస్తూంది.

## 5

"త్వరగా కదలండిరా. పొద్దుగూడా వాటారిపోతూంది.' అన్నాడు సుబ్బారాయుడు, వరికర్రల మోపును నెత్తికెత్తుకుంటూ.

ఆ వరిపొలంలో ఆడ మగ కలిసి ముప్పయి మంది పనిచేస్తున్నారు. ఆడవాళ్లు పాటలుపాడుతూ కొడవళ్లతో వరికర్రలను కోస్తున్నారు. కొందరు మగవాళ్లు ఆ కర్రలను ఒకటిగచేర్చి మోపుగకట్టి కళ్లంవద్దకు మోసుకెళుతున్నారు. మరికొందరు మగవాళ్లు కర్రలనుండి గింజలను రాల్చి బస్తాలలో పోసి, నిండిన బస్తాలను రాగిమానుక్రింద ఆగిఉన్న బండిలో వేస్తున్నారు.

పొలం మునసబుగారిది. మునసబుగారు గొడుగు వేసుకుని హరిజనులమధ్య తిరుగుతూ పర్యవేక్షణ చేస్తున్నాడు. సాయంకాలపు సూర్యుని ఏటవాలు కిరణాలు అతని మెడలోని సన్నని బంగారు గొలుసు మీద ప్రతిఫలిస్తున్నాయి. కుట్టిగాడు అతను చెబుతున్న దానికి తల ఊపుతూ వెంట తిరుగుతున్నాడు.

ఒకామె ముందు పాడగా మిగిలిన ఆడవాళ్లంతా ఆమెను అనుసరించి పాడుతున్నారు.

'కాశికి పడమట మున్నూ రామడాన ॥తందాన॥
ఆ భూమినియొక్క చక్రపట్నమేమి ॥తం॥
పట్నం ఏలు నవాభోజరాజు ॥తం॥
భోజరాజు నవాభోజరాజు ॥తం॥
................................'

సూర్యుడు పడమటి కొండల వెనకనుండి తొంగి చూడడం ప్రారంభించాడు.

కర్రలనుండి గింజలు రాలుస్తున్న దాసప్ప, 'పొద్దుగూట్లపడిపోయింది. మోపులు బిన్నగ ఈడ్చక రండ్రా' అని అరచాడు.

ఒకడు, 'ఏంపెట్టి ఈడ్చుక రమ్మంటవు? ఆ ముండలు కొడవళ్లు చేతబట్టుకున్నరేగాని కోసి చస్తన్నరా. వాళ్లకు పొద్దుగూకులు బాలనాగమ్మకథ పాడడంతోనే సరిపోయె' అన్నాడు.

మరొకడు ఆడవాళ్ల చెంతకువెళ్లి పైరును త్వరగా కోయమని పురమాయించాడు.

ఎలాగైనాసరే చీకటిపడేలోగా కళ్ళాన్ని పూర్తి చేయాలన్న దీక్ష అందరిలోనూ ఉంది. రేపటినుండి రోడ్డుపని ప్రారంభమవుతుంది. పొలం వైపు తలపెట్టడానికే వీలుండదు.

చలిగాలులు వీచడం ప్రారంభించాయి. గాలి పాటుకు ఆడవాళ్ల పైటలు మగవాళ్ల పంచెలు రెపరెపలాడాయి.

కుట్టిగాడు ఏదో ఛలోక్తి విసరగా మునసబు మోర ఎత్తినవ్వాడు. నవ్వుతూ చేత్తో మెడను తడిమి చూసుకున్నాడు. మెడబోసిగా ఉంది. మరొక సారి తడివి చూశాడు. మెడలో గొలుసులేదు.

'కుట్టీ' మునసబు గావు కేక పెట్టాడు.

నవ్వుతున్న కుట్టిగాడు తలెత్తిచూసి, 'ఏమయింది సామీ' అనడిగాడు.

వాడి కళ్ళలోకి చూస్తూ మునసబు, 'నా మెడ లోని గొలుసేది?' అనడిగాడు.

'అదేంది సామీ. ఇందాక మెడలో ఉండగా చూస్తినే. యాడన్నా పడిపోయిందేమో.' అని వాడు నడుంవంచి వెదకసాగాడు. వాడి తలమీద జుత్తు పొడుగ్గా ఉంది. మునసబుగారు వాడి జుత్తు పట్టుకుని లేపాడు.' ...కొడకా. గొలుసుకాజేసి నాటకమాడు తున్నావా?' అని చాచి చెంపమీద కొట్టాడు. వ్రేళ్ళు ఆనినంతమేర వానిచెంప కమిలిపోయింది. వాడు అతని కాళ్ళమీదపడి, 'నాకేవీ తెలవదుసామీ. నీతోడు' అన్నాడు. వాడా వాక్యాన్ని పూర్తిచేయకమునుపే మునసబుగారు కాలితో వాడినోటిపైన బలంగా తన్నాడు. వాడు నాలుగుగజాల కవతల పడ్డాడు.

తమ చేతులలోని కొడవళ్ళు కసిగా వరికర్ర లనుకోసి కూలదోస్తుండగా ఆడవారు పాడు తున్నారు.

'ఉండరె ఉండరె రండముండ లారా ॥తం॥
మూరెడు తుంట కర్రదీసుకునెను ॥తం॥
పడంగ లేవంగ బాదె నమ్మలార ॥తం॥
విలవిల ప్రాణం తన్నుకున్నదేమి ॥తం॥
అంబో యనుచు అడలసాగె నేమి ॥తం॥'

పాట అకస్మాత్తుగ ఆగిపోయింది. కుట్టిగాడు బాధతోవేసిన కేకవిని పొలంలో పనిచేస్తున్న వారంతా చిత్తరువులవలె క్షణకాలం నిలబడ్డారు. తరువాత తమ తమ పనులను మానుకుని గబగబ పరుగెత్తి వచ్చారు.

మునసబు దాపునఉన్న కర్రను తీసుకుని మీదికి వస్తుండగా కుట్టిగాడు తలపైన రెండుచేతులు జోడించి, 'సామీ నన్ను సంపమాక. బిడ్డలుగలోడ్ని నాకేపాపమూ తెలవదు. కావాలంటె ఏ దేవళంలోనైనా ప్రమాణంచేస్తా' అన్నాడు.

మునసబుగారు కర్రను దించి, 'ప్రమాణం చేస్తావా ?' అనడిగాడు.

కుట్టిగాడు నోటినుండి కారుతున్న నెత్తురును తుడుచుకుని, 'చేస్తా' అన్నాడు.

'కాణిపాకం దేవళంలో చేస్తావా ?'

'చేస్తా'

వాడలా అనగానే అందరూ ఆశ్చర్యపోయారు. కాణిపాకం దేవాలయం ఒంటిల్లు అగ్రహారానికి ఎనిమిది మైళ్ళ దూరానఉంది. ఆ దేవాలయంలో ప్రమాణం చేయడం గొప్ప సాహసకృత్యంగా ఆ ప్రాంతంలో పరిగణింపబడుతుంది. ఆ దేవాలయానికి దేశంలోని మరే దేవాలయానికీ లేని కొన్ని ప్రభావాలున్నాయని పుక్కిటి పురాణాలు, ప్రత్యక్ష నిదర్శనాలు ఉన్నాయి. ఆ దేవాలయంలో అసత్యమాడిన వాడికి కళ్ళుపోతాయని, చేతులు కుళ్ళిపోతాయని పలురకాలైన అరిష్టాలు వాటిల్లుతాయని ప్రతీతి. ఆ ప్రాంతంలో న్యాయనిర్ణయానికి కాణిపాకం దేవాలయంకన్న మించిన సాక్షి అనవసరం. ఆ దేవాలయంలో ప్రమాణం చేసి వచ్చిన కేసులు జిల్లాకోర్టులో సైతం తిప్పి పంపబడతాయని ప్రతీతి.

అలాంటి గుడిలో ప్రమాణం చేయడానికి కుట్టిగాడు సమ్మతించగానే అందరూ ఆశ్చర్యపోయారు. మునసబుగారి చేతిలోని కర్ర నేలమీద పడింది. అతడు, 'కుంటోడా' అని పిలిచాడు. గుంపులో నుండి కుంటోడు కాలు ఎగరవేస్తూవచ్చి అతని ముందు చేతులు కట్టుకుని నిలుచున్నాడు. 'కుంటోడా. గొలుసు ఈ పొలంలోనే మాయమయింది. తప్పకుండా వీళ్లలో ఒక్కడు కాజేసి ఉంటాడు. అందరినీ సోదాచెయ్యి. ఒక్కరినీ వదలిపెట్టకు.' అని ఆజ్ఞాపించాడు మునసబు.

హరిజనులందరూ వరసగా నిలుచున్నారు. సుబ్బారాయునితోసహా అందరినీ కుంటోడు సోదా చేశాడు. గొలుసు కనబడలేదు.

'గొలుసు కనబళ్ళేదు సామీ' అన్నాడు కుంటోడు.

మునసబుగారి ముఖంలో కోపం రెండింత లయింది. 'మరెక్కడెళ్ళింది. ఈ మాలకొడుకులే కాజేశారు. కాజేసి తరవాత తీసుకోవచ్చుననే ఉద్దేశ్యంతో ఏ బొరియలోనో వదిలి ఉంటారు. లేక మట్టిముద్దలోపెట్టి కంచె బయటికి గిరాటుపెట్టి ఉంటారు. ఒరే గాడ్డి కొడుకుల్లారా. నిజం చెప్పండి. లేకపోతే మిమ్మల్నందరినీ తోలుకెళ్ళి కాణిపాకంలో ప్రమాణం చేయిస్తాను' అన్నాడు.

ఎవరూ మాట్లాడలేదు. సరగుడు చెట్ల మీదుగా వీస్తున్నగాలి రయ్యిమని వీస్తూ శబ్దం చేస్తున్నది. రాగిమాను క్రిందఉన్న గుర్రం ఒకసారి తలయెత్తి సకిలించి మళ్ళీ గడ్డి తినడం ప్రారంభించింది.

ఎవరూ బదులు పలకకపోవడంతో మునసబుగారొక నిర్ణయానికొచ్చి, 'ఐతే మీరంతా ఇప్పుడే కాణిపాకం నడవండి. మీ అందరిచేత ప్రమాణం చేయిస్తాను.' అంటూ పొలం బయటికొచ్చాడు.

అందరూ రాగిమాను నీడన గుమికూడారు. ఆ రోజు పౌర్ణిమ. అటుసూర్యుడు అస్తమించగానే, ఇటు చంద్రుడు ఆకసంమీద కనబడి వెన్నెలలు వెదజల్లసాగాడు. రాగిమానుకింద చేరిఉన్న హరిజనులు తగ్గుస్వరంలో ఏవేవో చెప్పుకుంటున్నారు. ఒకడు, 'కాణిపాకం దేవళమంటే నాకేందో భయంగుందిరా' అన్నాడు ఇంకొకడు. 'గొల్సు నువ్వు తియ్యలేదుగదా మామా. నీ కెందుకు బయ్యం, తీసినోడు పుట్టు గతుల్లేకుండా చస్తడు' అన్నాడు.

తనముందు జరుగుతున్న చిత్ర విచిత్రాలను చూస్తూ చెట్టుబోదె నానుకుని నిలుచున్నాడు సుబ్బారాయుడు. ఈ అడవి న్యాయమేమిటో అతనికి అర్థం కాలేదు. మునసబుగారి గొలుసుపోయినమాట వాస్తవమే కావచ్చు. కాని తనకు న్యాయం చేకూర్చడానికి అతడు దౌర్జన్యాన్ని, అధికార దర్పాన్నీ ఆశ్రయించాలా ? తన మనసులో పొడసూపిన నలుసంత అనుమానాన్ని ఆధారంగా జేసుకుని ఒక నిరపరాధిని

చిత్రహింస చేయాలా? కేవలం అతనికున్న ఒక గుడ్డి నమ్మకాన్ని మన్నించేందుకు ముప్ఫైమంది స్త్రీ పురుషులు—రోజంతా శ్రమించి అలసి ఉన్నవారు—. ఎనిమిది మైళ్ళు నడిచి ప్రయాణం చెయ్యాలా?

గుర్రాన్ని కుంటోడు తీసుకొచ్చాడు. మునసబు గుర్రాన్ని అధిరోహించి, చెట్టుక్రిందనున్నవారి నుద్దేశించి, 'ఇక బయలుదేరండి' అని ఆజ్ఞాపించాడు.

నీడనఉన్న హరిజనులు బయటికొచ్చారు. మునసబుగారు గుర్రంమీదనుండి వారిని లెక్కపెడుతూ, 'ఒకటి, రెండు...ఇరవై తొమ్మిది, ఇరవై తొమ్మిది కుంటోడా! మరొకడేమయ్యాడు. ఎవరో భయపడి పారిపోయినట్లున్నాడు.' అని అరిచాడు.

'పారిపోలేదు. నేనిక్కడే ఉన్నాను.' అంటూ సుబ్బారాయుడు నీడలోనుండి బయటికొచ్చాడు.

'అందరూ బయలుదేరుతూఉంటే నువ్విలాగే ఉండటంలో ఏమిటి నీ ఉద్దేశ్యం?' అని గద్దించాడు మునసబు.

'మీరు నన్ను సోదా చేయించారు. గొలుసు కనబడలేదు. మీకు నమ్మిక కలగకపోతే నేను చేయగలిగిందేమీ లేదు. కేవలం మీకున్న నలుసంత అపనమ్మకాన్ని బాపేందుకు ఎనిమిదిమైళ్లు నడిచే అవసరం నాకులేదు' అన్నాడు సుబ్బారాయుడు.

మునసబుకు దిమ్మదిరిగి పోయింది: అలాంటి సమాధానం వస్తుందని అతడెన్నడూ ఎదురు చూడలేదు. అతడు అందరివైపు వ్రేలుచూపిస్తూ, 'వీరందరకూలేని అభ్యంతరం నీ కొక్కనికే ఎందుకుండాలి?' అనడిగాడు.

సుబ్బారాయుడు వారందరివైపు ఒకసారి చూశాడు. తానొక గొర్రెలమందను చూస్తున్నట్లు అతనికి అనిపించింది. 'వాళ్ళు అభ్యంతరం చెప్పకపోవడానికి గల కారణాలు నాకు తెలియవు. నేను దొంగనని మీకుతోస్తే న్యాయవిచారణ చేసేందుకు పోలీసులున్నారు, కోర్టులున్నాయి. అంతేగాని ఇలాంటిచిట్కా పనులు చేసేందుకు నేను సిద్ధంగాలేను' అన్నాడు సుబ్బారాయుడు. ఇక తాను చెప్పవలసిందేమీ లేనట్లు తలపాగానుతీసి విదిలించి భుజానవేసుకుని వెనుదిరిగాడు.

చెళ్ళుమని కొట్టి గుర్రాన్ని వెనకకు మళ్ళించాడు మునసబు.

కుంటోడు, 'అడెళ్లితే ఎళ్లనీండి. మిగిల్నోళ్లసేత పెమానం సేయిద్దాం. బయల్దేరండి.' అన్నాడు.

'ఇక ప్రయాణం చెయ్యాల్సిన అవసరం లేదు. దొంగ తనంతట తానే బయటపడ్డాడు.' అన్నాడు మునసబు.

గిరుక్కున వెనుదిరిగాడు సుబ్బారాయుడు. మునసబుగారి ముఖంలోకి గుచ్చిచూసి, తుపుక్కున నేలమీద ఉమిసి, వెనుదిరిగి చకచక నడవడం ప్రారంభించాడు.

మునసబుగారి ముఖం రక్తం పులుముకున్నట్లు ఎర్రయినంది. 'అతడు పటపట పళ్ళు కొరకడం ప్రక్కనున్నవారికి వినిపించింది.

* * *

ఆ రాత్రి నులకమంచంమీద పడుకున్న సుబ్బారాయునికి ఒక పట్టాన నిద్రరాలేదు. పొలంలో నేలమీద దొర్లుతూ కుట్టిగాడు కార్చిన నెత్తురు, నెత్తిన చేతులు జోడించి ప్రాణం దక్కించమని వాడు చేసిన ప్రార్థన—మళ్ళీ మళ్ళీ అతనికి జ్ఞాపకానికి వచ్చి వచ్చి మెదడును అల్లకల్లోలం చేశాయి.

తెల్లవారుజామున అతనికి కునుకుపట్టింది.

ఉదయం ఎవరో తలుపుమీద తడుతూఉండగా సుబ్బారాయునికి మెలకువ వచ్చింది. అతడులేచి తలుపు తీశాడు. బయట మాస్టరుగారు నిలుచుని ఉన్నారు. ఉదయపు సూర్యుని కిరణాలు సూటిగా కళ్లలో గుచ్చుకోగా సుబ్బారాయుడు కళ్లు చిట్లించాడు. 'మీరా మాస్టారూ' అన్నాడతడు.

'నేనే. ఐనా ఇదేమిటి? ఇవాళ రోడ్డు ప్రారంభిస్తున్నామని తెలిసిగూడ ఇంత ఆలస్యంగా నిద్ర లేచావు?' అన్నాడు మాస్టరు.

'పొరబాటయింది మాస్టారు. రాత్రి చాల ఆలస్యంగా పడుకున్నాను. తొందరగా మెలకువ రాలేదు. చాల పొద్దెక్కిందే. మావాళ్లు పని ప్రారంభించారా?' అనడిగాడు సుబ్బారాయుడు.

'ఏదీ. ఇంతవరకు ఒక్కడూ గూడెం వదిలి రాలేదు. సంగతేమిటో కనుక్కుందామని నేరుగా

నీదగ్గరకొచ్చాను. నువ్వేమో ఇలా ఉన్నావు' అన్నాడు మాస్టరు.

'ఒక్కనిమిషం అలా కూర్చోండి, వెంటనే బయలుదేరుదాం' అంటూ సుబ్బారాయుడు మంచాన్ని తెచ్చి గుడిసెబయట వేశాడు. మాస్టరు మంచంమీద కూర్చుని, జేబులోనుండి ఎస్టిమేషను కాగితాలను తీసి చూడసాగాడు. సుబ్బారాయుడు ముఖం కడు క్కుంటూ నిన్నసాయంత్రం మునసబుగారి వరిపొలంలో జరిగిన సంఘటనను పూసగుచ్చినట్లు చెప్పాడు.

ఇంతలో కుట్టిగాడు తన బృందంతో వీధి మలుపు తిరిగి అల్లంతదూరాన వస్తూ ఉండడం కని పించింది. మాస్టరు మంచంమీదనుండిలేచి, 'రాయుడూ వాళ్లంతా వస్తున్నారు, నువ్వు తొందరగా తెమలాలి' అన్నాడు. సుబ్బారాయుడు కండువాతో ముఖం తుడుచు కున్నాడు. వాళ్లిద్దరూ కలిసి వీధిలోకి వచ్చారు.

కుట్టిగాడు ముందు నడుస్తుండగా మిగిలిన హరిజనులు అతని ననుసరించి వస్తున్నారు: వారి చేతులలో రోడ్డు నిర్మాణానికి కావలసిన పారలు, పలుగులు మొదలయిన పరికరాలు లేవు.

హరిజనులగుంపు చేరువగా రాగానే సుబ్బా రాయుడు నవ్వుతూ, 'ఏమిటిది కుట్టిమామా· హరి కథ వినడానికి బయలుదేరారా ఏమిటి? పార పలుగులు ఏమీ లేకుండా ఉత్తిచేతులలో అక్కడకువెళ్లి ఏం చేద్దామని?' అనడిగాడు.

'మేము రోడ్డువేయడానికి బయలుదేరలేదు.' అన్నాడు కుట్టిగాడు.

'ఏం?!' మాస్టరుగారి ముఖంలో లొట్టుపాటు కొట్టవచ్చినట్లు కనిపించింది.

కుట్టిగాడు సుబ్బారాయునివైపు గజ్జికుక్కను చూసినట్లు చూశాడు. తరువాత మాస్టరువైపు తిరిగి, 'మాస్టరుగారూ ఈ సుబ్బారాయుడు మున సబుగారినే ఎదిరించేటంతటి గొప్పవాడైపోయాడు. వాడు ప్రారంభించిన రోడ్డుపనిలో మేం పాల్గొన లేము.' అన్నాడు.

మాస్టరుగారికి తలగిర్రున తిరుగుతున్నట్లని పించింది. అతని చేతిలోని ఎస్టిమేటు కాగితాలు నీ రెండలో మెరుస్తూ ఉదయపు గాలికి రెపరెప లాడాయి.

గుంపు ముందుకు సాగబోయింది. మాస్టరు వీధికడ్డంగా నిలుచుని కుట్టిగాని చేతులుపట్టుకుని, 'ఏమిట్రాకుట్టీ—ఇది. మాటా-మాటా వచ్చింది సుబ్బా రాయునికీ మునసబుగారికేగదా. మధ్యమీరు రోడ్డుపని ఆపివేయడం ఏమిటి? అసలిది మీ రోడ్డేగదయ్యా. మీ రోడ్డును మీరు వేసుకోవడాని ఇన్ని పట్టింపు లెందుకు?' అన్నాడు.

'అదంతా మాకూ తెలియదు· రోడ్డు నిర్మా ణంలో పాల్గొంటే మాకీ ఊర్లో మంచినీళ్ళు దక్క వని మునసబుగారు చెప్పారు' అన్నాడు కుట్టిగాడు.

ఆ మాటవినగానే మాస్టరు అవాక్కయి పోయి నాడు. అతని చేతిలోని ఎస్టిమేషను కాగితాలు జారి క్రిందపడ్డాయి.

అతనిని ప్రక్కకి నెట్టివేసి కుట్టిగాడు ముందుకు నడిచాడు. గుంపు అతనిని అనుసరించింది. ఎస్టిమేషను కాగితాలు వాళ్లందరి కాళ్లకిందపడి నలిగి పుల్లదుమ్ములో కూరుకుపోయాయి.

క్రమక్రమంగా దూరమైపోతున్న ఆ గుంపు కేసి చూస్తూ మాస్టరు, సుబ్బారాయుడు నిశ్చేష్టులై నిలబడిపోయారు. ఉదయపు ఎండ కలగజేసిన వారి నీడలు క్రమక్రమంగా పొట్టివౌతున్నాయి.

నిద్రలేచి కళ్లు నులుముకుంటూ వీధిలోకి వచ్చిన హరిజన యువకుడొకడు పుల్లదుమ్ములో సగా నికి కూరుకుపోయిన కాగితాన్ని చేతిలోనికి తీసు కున్నాడు. దాని మడతలువిప్పి తలక్రిందులుగ పట్టు కుని ఏదో వింతవస్తువును చూసినట్లు చూడసాగాడు. అలా కొంతసేపు చూసి కాగితాన్ని ఉండచేసి మొండిగోడక్రిందికి గిరవాటుపెట్టాడు. మొండిగోడ కిందఉన్న కుంటిగాడిద ఆ కాగితాన్ని ఆప్యాయంగా స్వాహాచేసింది.

శిలాప్రతిమలలాగ వీధిమధ్యన నిలుచునిఉన్న మాస్టరును, సుబ్బారాయుడిని చూసి వీధికుక్క విప రీతంగా మొరగసాగింది.

---

# 'వచన కవిత–అభిమానుల అత్యుక్తులు' ఒక పరిశీలన

శ్రీ టి. యల్. కాంతారావు

కవిత్వం ముందు పుడుతుంది; విమర్శ తరువాత పుడుతుంది. ఒకానొక క్రొత్త కవితా ప్రక్రియ ఒకానొక కవినుండి పుట్టేడప్పుడు ఆ ప్రక్రియకు సంబంధించినంతవరకూ కొన్ని ప్రాణభూతమైన లక్షణాలను ఆ కవి ఏర్పరుచుకుంటాడు. ఇలా ఏర్పడినటువంటి లక్షణాలను అతని కతనుగా బహిర్గతం చెయ్యవచ్చు; లేక ఆ క్రొత్త కవితా ప్రక్రియని సహృదయతతో, సానుభూతితో చదివిన విమర్శకుడు వ్యక్తం చెయ్యవచ్చు. విమర్శకుడు నిజంగా సహృదయు డయే టట్లయితే కవికి, కవిత్వానికీ న్యాయం జరుగుతుంది. కవే విమర్శకు డయినపుడు ఆ విమర్శలో కొంత అతివ్యాప్తి ఉండవచ్చు; కొంత పాక్షికదృష్టి ఉండవచ్చు. ఆధునిక కాలానికి సంబంధించినంతవరకూ ఎక్కువగా విమర్శకులే కవులు, కవులే విమర్శకులుగా ఆధునిక కవిత్వమూ, విమర్శా బుజాబు చేస్తున్నాయి. ఈ విధానంవల్ల కొంత ప్రయోజనముంది; కొంత అనర్థం ఉంది. అయితే అనర్థంకంటె ప్రయోజనమే ఎక్కువగా ఉందని కవులైన విమర్శకుల రాతలవల్ల విశదమవుతోంది.

ఏప్రిల్ 1971 'భారతి' మాసపత్రికలో 'వచనకవిత—అభిమానుల అత్యుక్తులు' అనేవ్యాసంలో నోరి నరసింహశాస్త్రిగారు శ్రీ కుందుర్తి అభిప్రాయాలను స్థూలంగా సమీక్షించడం జరిగింది. ఆ సమీక్షలో కుందుర్తికీ, వచనకవిత్వానికీ కొంతవరకూ అన్యాయం జరిగిందనే భావనతో ఈ పరిశీలనా వ్యాసమును రాయడం జరిగింది. ప్రాచీన కవిత్వమంటే ద్వేషభావంతోగ్గాని, నరసింహశాస్త్రిగారిని దుయ్యబట్టడానికిగాని ఈ వ్యాసం రాయడంలేదు. నరసింహశాస్త్రిగారి కొన్ని అభిప్రాయాలు నాకు అంగీకారయోగ్యంగా కనబడక పోవటంవలన నా అభిప్రాయాలనుకూడా పత్రికాముఖంగా వెలువరించడంలో దోషంలేదనే భావనతో ఈ వ్యాసం రాయడాని కుపక్రమించాను. ఈ వ్యాసంలో నాపరంగా ఏవైనా దోషాలుంటే—నరసింహశాస్త్రిగారు, సహృదయులైన పాఠకులు క్షమించగలరని ఆశిస్తాను.

'స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే స్థూలంగా శ్రీ శ్రీ యుగంలోని కవితా వికాసమని చెప్పకోవచ్చును. ఎందుకంటె పాతపద్ధతికి సంబంధించిన పద్యకావ్యాలు ఎప్పుడూ వస్తూనే ఉంటాయి. వాటికి బానిసత్వంతోగాని స్వాతంత్ర్యముతోగాని అంతగా సంబంధంలేదు. కొయ్య అచ్చుపెట్టి వినాయకుడి బొమ్మలు వరుసగా తీసినట్లు ఒకేభాష ఒకేభావనతో వెలువడుతుంటాయి. జీవితంలో వచ్చే మార్పులను అవి ప్రతిఫలించవు...సాహిత్యంలో తిరిగి ప్రయోజన వాదాన్ని ప్రవేశపెట్టిన ఘనత శ్రీ వీరేశలింగం గారిది. దీని ఫలితమే శ్రీ శ్రీ యుగం. ఆనాటి నుండి నేటివరకు కవిత్వంలో ప్రయోజన వాదమూ, కళావాదమూ — రెండూ ఒకదాని వరసనే ఒకటి సమాంతర రేఖల్లా నడుస్తున్నవి...ప్రయోజనవాదము నెగ్గింది కనుకనే భాషలో వ్యవహారిక వాదము నెగ్గింది. భావములో అభ్యుదయవాదము నెగ్గింది. రూపములో వచనగేయవాదము నెగ్గింది. అందువల్ల స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే వచనగేయ కవితా వికాస మన్నమాట.' (స్వాతంత్ర్యానంతర కవిత. జనధర్మ 1969 డిశంబరు ప్రత్యేకసంచిక. స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగుకవిత.) పై కుందుర్తి అభిప్రాయాన్ని నరసింహశాస్త్రిగారు తమవ్యాసంలో ఉదహరించి దాన్ని వ్యాఖ్యానించారు. నరసింహశాస్త్రిగారి

వ్యాఖ్యానం ఇది. 'ఈ వచన కవిత్వము ఆవిర్భ వించిన తరువాత సృష్ట్యాదినుంచీ ఇప్పటికి 30 సం॥ ల క్రిందటివరకూ పుట్టిన పద్యకవిత గేయ కవితా చదివి ఆనందించేవాళ్ళు లేక విస్మృతము లైనవనిగాని అవుతవనిగాని శ్రీ కుందుర్తి అభిప్రాయ మైతే, వారి కవితాగ్రహణశక్తిని ఏమనాలో తెలి యదు. నిజానికి ఆ మాటలకు అదే అర్థమున్నది. వారి ఉద్దేశముకూడా అదే ఐఉంటుందనడానికి పాత పద్ధతి పద్యకావ్యాలను వినాయకుని అచ్చుబొమ్మ లతో పోల్చడములోనే అభివ్యక్త మవుతున్నది. మా అన్వయమే శ్రీ కుందుర్తి అభిమానమయితే వారికి గల వచనకవితాభిమానము వారిని అహంభావము తుది అంచులకు తీసుకొనిపోయిన దనక తప్పదు.' ఈ వ్యాఖ్యానంలో నరసింహశాస్త్రిగారు తమ అభిప్రా యాన్ని కుందుర్తి అభిప్రాయముగా భావించినట్లు కనబడుతుందేగాని ఇదే కుందుర్తి అభిప్రాయమని రూఢపరచినట్లు లేదు. ఇక్కడ పాఠకుడు గమనించ వలసిన విషయం ఒకటున్నది. కుందుర్తి రచనా పరంగా విమర్శకుడుకాదు. ఆయన వచన గేయకవి. ఆయనకు వచనకవిత్వంమీద కొన్ని అభిప్రాయా లున్నవి. ఆ అభిప్రాయాల్ని స్థూలంగా వ్యక్తంచెయ్య డమే ఆయన ధ్యేయంగాని వచనకవితాప్రక్రియను గూర్చి సూక్ష్మాంశ విశ్లేషణకాదు. కాగా ఒక కవితా ప్రక్రియకు అంకితమైపోయిన ఒకకవి ఆ కవిత్వంపై కొన్ని అభిప్రాయాల్ని వెలువరించేటప్పుడు కొంత అత్యుక్తి ఉంటుందేగాని అహంభావం ఉండదు. (ఆకవి సత్కవి అయితే). కుందుర్తి మాటల్లోని ఒక్కొక్క పాదాన్నే మనం పరిశీలించుకుంటూపోతే కుందుర్తి అసలు అభిప్రాయమేమిటో అర్థం అవుతుంది. స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే స్థూలంగా శ్రీశ్రీ యుగంలోని కవితా వికాసమని చెప్పుకోవచ్చును. శ్రీశ్రీ యుగం అనేమాట కుందుర్తి కల్పించినది కాదు. సాహిత్య కాలాల్ని యుగాలుగా విభజించడ మనేది ఈ నాడు క్రొత్తగా వచ్చినదికాదు. పూర్వ కాలంనుంచీ ఈ యుగ విభజన జరుగుతూనే ఉన్నది. యుగ విభజన ఏ ఒక్క సిద్ధాంతంమీద ఆధారపడి జరగడంలేదు. అనువాదయుగం, ప్రబంధపూర్వయుగం, ప్రబంధయుగం—ఇలా ఒకరకమైన యుగ విభజన కనబడుతుంటే మరోప్రక్క కవిత్రయ యుగం (నన్నయయుగం, తిక్కనయుగం), శ్రీనాథయుగం ఇత్యాదులుగా ఇంకొకరకమైన యుగ విభజన కనబడు తున్నది. కవిత్వాన్నిబట్టి కొంతమంది, కవుల ప్రత్యేక తనుబట్టి కొంతమంది, రాజుల పరిపాలనా కాలాన్ని బట్టి కొంతమంది సాహిత్యాన్ని యుగాలుగా విభజిం చారు. భావకవితానంతర కాలంనుంచీ పర్చిల్లిన అభ్యుదయ కవితాకాలాన్ని శ్రీ శ్రీ యుగం అన్నారు. ఒక యుగానికి ప్రాతినిధ్యం వహించే మహోత్తమ సాహిత్యలక్షణాలు శ్రీశ్రీ కవిత్వంలో కనిపించాయి కాబట్టి ఆ యుగానికి శ్రీశ్రీ యుగం అనే నామం అన్వర్థ మయినది. 'పాతపద్ధతికి సంబంధించిన పద్య కావ్యాలు ఎప్పుడూ వస్తూనే ఉంటాయి. వాటికి బాని సత్వంతోగాని, స్వాతంత్ర్యంతోగాని అంతగా సంబంధం లేదు. కొయ్యఅచ్చుపెట్టి వినాయకుడి బొమ్మలు వరుసగా తీసినట్లు ఒకేభాష ఒకేభావనతో వెలువడు తూంటాయి. జీవితంలో వచ్చే మార్పులను అవి ప్రతి ఫలించవు.' పాతపద్ధతి అనంగానే మనకు గుర్తుకు వచ్చేది ప్రాచీన సాహిత్యమే గదా ! ప్రాచీన సాహిత్య మంతా ఒకేరకంగా లేదు. ఈ నాటి సాహిత్యాన్ని సామాజిక జీవితం, రాజకీయాలూ పాలించినట్లుగానే ఆ నాటి సాహిత్యాన్ని మతం, శృంగారం పాలించాయి. మత ప్రాచుర్యాన్నిబట్టి సాహిత్యప్రక్రియ మారింది. వైదిక, శైవమతాలు, ప్రబంధసాహిత్యం ఈ అభి ప్రాయానికి ఉదాహరణలు. కొయ్యఅచ్చుపెట్టి వినాయ కుడి బొమ్మలు వరుసగా తీసినట్లు అనేమాట కొంచెం తీవ్రమయినది. ఎంచేతనంటే—సాహిత్యం ఆనాడేకాదు ఈనాడుకూడా అలాగే ఉంది. అభ్యుదయ సాహిత్య మంతా ఒకేభావన, ఒకేభాష. వచనకవిత్వంలోమాత్రం వలసినంత వైవిధ్యంఉంది. సమాజజీవితానికి ఆనాటి సాహిత్యంలో స్థానం లేదనేది నిర్వివాదమైన విషయం. ఆనాటి సాహిత్యం పరిమితపరిధిలో మాత్రమే పరి భ్రమించింది. ఒకవర్గంప్రయోజనాలకు అనుగుణంగా ఆనాటి సాహిత్యం వికసించింది. 'సాహిత్యంలో తిరిగి ప్రయోజనవాదాన్ని ప్రవేశపెట్టిన ఘనత శ్రీ వీరేశ లింగంగారిది. దీని ఫలితమే శ్రీ శ్రీ యుగం. ఆనాటి నుండీ నేటివరకూ కవిత్వంలో ప్రయోజనవాదమూ, కళావాదమూ రెండూ ఒకదానివరసనే ఒకటి సమా నాంతరరేఖల్లా నడుస్తున్నవి.' ఏసాహిత్యానికైనా ఒక ప్రత్యేక ప్రయోజనమనేది ఉంటుందా? దీనిమీద

భిన్నాభిప్రాయాలున్నవి. కళ కళకోసమేననే వాదం పూర్తిగా కాకపోయినా చాలావరకూ పరాస్తమయినదని ఇవాళ క్రొత్తగా చెప్పవలసిన అవసరంలేదు. ప్రయోజన వాదానికికూడా పునాది ప్రాచీనసాహిత్యంలోనే ఉంది. 'విశ్వశ్రేయః కావ్యం'. ఇది పూర్తిగా కావ్యప్రయోజనాన్నిగురించి చెప్పినదే. ఏకవిత్వంలోనైనా కవి తద్ద్వారా ఆశించే సామాజికపరిణామం ఒకటుంటుంది. వైదికమతకవిత్వము విశ్వశ్రేయస్సును కాంక్షించినదే. వీరశైవమతము విశ్వశ్రేయస్సును కాంక్షించినదే. మను చరిత్రద్వారా పెద్దన ప్రబంధసాహిత్యంలో విశ్వ శ్రేయస్సునే కాంక్షించాడు. అయితే ఏప్రయోజనం లేకుండా ఈ సమాజాన్ని పూర్తిగా విస్మరించి ఎక్కడో, ఎదో అలౌకికఆనందంఉంది; దాన్ని పొందడమే కవితా పరమావధి అని భావించేవారెవరైనా ఇంకాఉంటే వారి సంస్కారానికి నమస్కారం. సాహిత్యంలో ఏవిషయం చెప్పినా కళాత్మకమైన విలువలను కలిగిఉండాలి. ఈ విషయం విమర్శకులకు సంబంధించినది. విమర్శకుడు కావ్యత్వపు విలువలను నిర్ణయించడంలో కవిచెప్పే సిద్ధాంతానికి అతీతుడుగా ఉంటాడు. విమర్శకుని బాధ్యతఅంతా కావ్యపువిలువల్ని అంచనా కట్టడంవరకే. ప్రయోజనవాదం, కళావాదం ఈ రెండూ ఒకదానిలో ఒకటి ఇమిడిపోయినపుడు ఉన్నత కవితావిర్భూతి జరుగుతుంది.

'ప్రయోజనవాదం నెగ్గిందికనుకనే భాషలో వ్యవహారికవాదం నెగ్గింది. భావములో అభ్యుదయ వాదము నెగ్గింది. రూపములో వచనగేయరూపము నెగ్గింది: అందువల్ల స్వాతంత్ర్యానంతర కవిత్వమంటే వచనగేయ కవితావికాసమన్నమాట' ప్రయోజనవాదం నెగ్గిందిఅంటె—సాహిత్యానికి సాంఘికదృక్పథం, సామాజికప్రయోజనం ఉండాలిఅనే భావన సర్వత్రా వ్యాప్తమయిందని అర్థం. ప్రయోజనవాదంతోబాటు కావ్య భాష మారింది. పూర్వపు కావ్యభాషకి, ఇప్పటి కావ్యభాషకి పోలికలేదు. పూర్వకావ్యభాష గ్రాంథికం. పూర్వపు కవిత్వముయొక్క పరిధి సంకుచితమని ఇంతకు పూర్వమే చెప్పాను. పూర్వపు కవిత్వము పండితాదరణమైనదేతప్ప జనాదరణీయమైనదికాదు. పూర్వకవిత్వపు ప్రయోజనంకూడా పండితులచేత 'భేష్' అనిపించుకోవడమేగాని సామాజిక వ్యవస్థలోని ప్రజలచేత 'హాహా' అనిపించుకోవడంకాదు. ఈ కావ్య భాషా దృక్పథంమీద తీవ్రమైన విప్లవాన్ని లేవదీసిన వారు శివకవులు. కావ్యప్రయోజనంతోబాటు భాషలో, భావనలో, రచనాశిల్పంలో క్రొత్తదనాన్ని తెనుగు సాహిత్యంలో మొట్టమొదటిగా ప్రవేశపెట్టినవారు శివకవులే. ఆధునికకాలంలోని కవిత్వానికి సమాజమే లక్ష్యంకాబట్టి వ్యవహారిక భాష కావ్యభాషగామారింది. రూపంలో వచనగేయ రూపం నెగ్గడమంటే ఏమిటి? అభ్యుదయకవులు సంప్రదాయక ఛందస్సులను విసర్జించి మాత్రాఛందస్సులను ప్రవేశపెట్టారు. వారి భావనకు మాత్రా ఛందస్సులు అనుకూలంగా కనిపించాయి. అభ్యుదయ కవితాభావనఅంటే మార్క్సీయ భావన అనే అప్పటి అర్థం. అనేక భావాలకి వాహికగా వచనగేయం నిలబడటంవలన అభ్యుదయ యుగానంతర తెలుగు సాహిత్యంలో వచన కవిత సంప్రదాయంగా స్థిరపడింది. కుందుర్తిపై చెప్పిన వాక్యాల్లోని చారిత్రక పరిణామ స్వరూపంయొక్క యథార్థ స్థితి ఇది. అయితే ఇప్పటికీ పాతపద్ధతిలో కావ్యాలు వస్తున్నాయి; కవులు రాస్తున్నారు; పాఠకులు చదువుతున్నారు. పరిమాణంలో వచన కవిత్వంయొక్క ఆధిపత్యం ఋజువు అవడంవలన రూపంలో వచన కవిత్వం నెగ్గిందని అనిచెప్పడమేగాని నరసింహశాస్త్రిగారు భావించినట్లుగా సంప్రదాయక కవిత్వం ఈ కాలంలో చచ్చిపోయిందని చెప్పడం కుందుర్తి అభిప్రాయంకాదు.

'అశేష ప్రజానీకానికి ప్రయోజనాత్మకమైన ఆనంద కల్పనయే ప్రధాన మనే వాదానికి, కనీసం ఈ యుగంలో బలం ఎక్కువ. ఏ రంగంలోనైనా పాతకు కొత్తకూ సంఘర్షణ తప్పదు. పాత వోటమీ తప్పదు...ఈ పద్యమే వృత్తమే తుది స్వరూపమని మాత్రం అంగీకరించం. దీనికంటె మేలైనరూపం ఏదైనా మనస్సుకు తగుల్తుందేమోననే ప్రయత్నం, కొత్తప్రయోగం నిరంతరం జరగవలసిందే.' కుందుర్తి ఈ మాటల్ని నరసింహశాస్త్రిగారు తమ వ్యాసంలో ఉదహరించారు. పై మాటలవల్ల వచనకవిత్వంపైగాని, ఆధునికతమీదగాని కుందుర్తికున్న అభిప్రాయం వెల్లడవుతున్నది. ఒకనాటి సాహిత్యంయొక్క పరిమిత ప్రయోజనం ఈ నాడు విస్తృత రూపం ధరించిం

టనేది అందరూ అంగీకరించవలసిన సత్యం. సాహిత్య రంగంలోనేకాదు. సామాజిక జీవితంలో ప్రతిరంగం లోనూ పరిణామం అనివార్యం. ఈ పరిణామక్రమంలో పాతవిలువలకి ప్రాధాన్యము తగ్గటం క్రొత్తవిలువలకి ఆధిపత్యం రావడం సహజం. అయితే ప్రతికొత్త మార్పూ ఏ రంగంలోనైనా అంగీకారయోగ్యంకాదు. ఒక క్రొత్తమార్పు తాత్కాలికంగా ప్రజలపై దాని ప్రభావాన్ని చూపించవచ్చు. అలావచ్చిన క్రొత్తమార్పు పాతకంటె బలీయమైనప్పుడు, ఆచరణ యోగ్యమైన పుడు ఆ మార్పుయొక్క ప్రభావం ఆ నాటి సమాజం మీద చూపిస్తూనే ఆగామి సమాజానికి సంప్రదాయంగా పరిణమిస్తుంది. ఇక్కడ 'సంఘర్షణ' అనే శబ్దం మీద ఎక్కువ శ్రద్ధ చూపిస్తే ఒక నిజం బయట పడుతుంది. సంఘర్షణ ఎప్పుడూ రెండు సంప్రదాయాలమధ్య జరుగుతుంది. సంఘర్షణలో బలంగల సంప్రదాయం జయిస్తుంది; బలహీనమైన సంప్రదాయం ఓడిపోతుంది. ఇక్కడ మనం చర్చించుకునేది సంప్రదాయ విషయం కాబట్టి ఓడిపోవడం అనే మాటని ఇంకా విపులీకరించవలసిన అవసరం ఉంది. ఒకనాటి సంప్రదాయం ఇవాళ ఓడిపోవడం అంటే ఈ నాటి సమాజంలో దానికి బలంలేదని అర్థం. ఆ సంప్రదాయం వర్ధిల్లిన రోజులలో ఆ నాటి సమాజంలో దానికి బలం ఉండవచ్చు. ఈ నాడు బలహీనమైనది అంటే ఆ నాడు బలంలేనిదని అర్థంకాదు. పాత ఓటమి తప్పదు అంటే అర్థం ఇది. 'ఈ పద్యమే ఈ వృత్తమే తుది స్వరూపమని అంగీకరించేది లేదు.' అనే వాక్యానికిముందు కుందుర్తి 'యుగే యుగే' లో మరో వాక్యం అన్నాడు. 'నన్నయాదులతో ఆరంభమైన తెలుగు కవిత్వం మాకు తల్లి'. ఈ వాక్యాన్ని నరసింహ శాస్త్రిగారు ఉదహరించలేదు. మేలైన రూపంకోసం ప్రయోగం సాహిత్యంలో అనాదినుంచీ జరుగుతూనే ఉన్నది. ప్రయోగం అనేది ఈనాడు క్రొత్తగా పుట్టిందికాదు. అయితే ఆ నాడు జరిగిన ప్రయోగాలు ఒక చట్రంలో ఇమిడిపోయాయి కాబట్టి అంత తీవ్రసంచలనం ఏర్పడలేదు. ఈ నాటి ప్రయోగం సంప్రదాయానికి పూర్తిగా వ్యతిరేకంగా కనబడటంవలన దీన్ని అంగీకరించడం కొంతమందికి

కష ంగా కనబడుతోంది. ఆంగ్లకవి అయిన టి. ఎస్. ఇలియట్ 'సంప్రదాయము—వైయక్తిక ప్రతిభ' అని ఒక వ్యాసం రాశాడు. అతనుకూడా సమాజ సంప్రదాయం ప్రకారం ప్రాచీనుడు; కవితా సంప్రదాయం ప్రకారం ఆధునికుడు. అతను ఆ వ్యాసంలో 'Novelty is better than reputation' అంటాడు. క్రొత్తదనంకోసం అన్వేషణ అనేది ఏ భాషలోనైనా, ఏ కాలంలోనైనా తప్పదు.

నరసింహశాస్త్రిగారు తమవ్యాసంలో కుందుర్తికి సంబంధించినంతవరకూ రెండు మూడు ఉదాహరణలతో ఆయన్ని అంచనా వేశారు. పైగా కుందుర్తి మాటలే తన ఈ వ్యాసాన్ని రాయడానికి పురికొల్పాయని రాశారు. ఒక కవిని అంచనావేసేటప్పుడు అతను చెప్పిన ఏ ఒకటి రెండు మాటలో తీసుకుని విలువలు నిర్ణయిస్తే అతనికి న్యాయం కంటె అన్యాయం ఎక్కువగా జరగటానికి అవకాశం ఉంది. కనుక కుందుర్తి ఇతర సందర్భాలలో వచనకవిత్వంపై వెలిబుచ్చిన అభిప్రాయాలను మరి కొన్నిటిని సమీక్షించి తరువాత వచనకవితారూపాన్ని గురించి వివరిస్తాను.

'ఆధునిక యుగంలోని సాహిత్యానికంతకూ ప్రధాన లక్షణం విశ్వశ్రేయశ్చైతన్యం. విశ్వశ్రేయో భావన పూర్వులు చెప్పినదికాదా అంటే చెప్పినదే. ఏయుగంలోనైనా నూటికి నూరుపాళ్లు కొత్తఅంటూ ఏదీ పుట్టదు. కొత్తఅని చెప్పబడిన దాని బీజాలు పూర్వకాలంలో ఉండనేఉంటాయి. అయితే విస్మరింపబడిన కొన్నివిలువలకు మళ్లీ ప్రాణంపోయడం జరుగుతుంది. అవి సరికొత్తభావాలుగా భాసిస్తాయి. అదే విధంగా ప్రబంధయుగంనుండి క్రమంగా గాడితప్పిన సామాజికచైతన్యం మృగ్యమై, సమాజంలోని ఉన్నత వర్గాలవారి కాలక్షేపానికీ, పండితప్రకాండుల అవగాహనకు మాత్రమే పరిమితమయిపోయిన కవిత్వం ఆధునికయుగంలో ప్రజలనేవారు కొందరున్నారనీ, వారి శ్రేయస్సు అన్నింటికంటె ముఖ్యమైనదనీ, వారిని ఉత్తేజపరచడం మానవసమాజ పురోగమనానికి అవసరమనీ, . అది తన ధర్మమనీ గుర్తించింది.' (ఆంధ్రపత్రిక సౌమ్య ఉగాది ప్రత్యేక సంచిక.) కుందుర్తి వెలిబుచ్చిన ఈ అభిప్రాయంలో కవిత్వం యొక్క పరిణామదశలు ఛాయామాత్రంగా వ్యక్తం అవుతున్నాయి. విశ్వశ్రేయశ్చైతన్యం అనేది పూర్వకాలంలోనేఉంది అనటంలోగల ఔచిత్యం మనం ఈ క్రిందివిధంగా ఊహించవచ్చు. పూర్వకాలంలో వైదిక మతం చాతుర్వర్ణ్యవర్గసమాజాన్ని అనుసరించింది. కర్మజ్ఞానమార్గాలు అగ్రవర్ణాలకే పరిమితమయ్యాయి. అయితే అప్పటి సామాజికవ్యవస్థలో విశ్వశ్రేయస్సు అనే పదానికి అర్థం ఈ చాతుర్వర్ణ్య వర్గసమాజంలో ఏవర్గానికావర్గం తమతమ పరిధుల్లో జీవించడమే. అప్పటికదే శ్రేయస్సు. నన్నయ అనంతరం శైవ మతం విజృంభించింది. వీరశైవమతప్రాబల్యం ప్రజల్లోకి ప్రాకింది. చాతుర్వర్ణ్య సమాజాన్ని వీరశైవులు అంగీకరించలేదు. వర్గప్రాధాన్యంలేని సర్వమానవ సమానత్వాన్నీ, భక్తిమార్గాన్నీ వీరశైవులు బోధించారు. అప్పటికది విశ్వశ్రేయస్సుగనే భావింపబడినది. ఆ పిమ్మట మరల వర్గసమాజప్రాబల్యమే పటిష్ఠమైంది. భోగలాలస నలువైపులా వ్యాపించినకాలంలో పెద్దన దానికి వ్యతిరేకంగా ప్రత్యేక పరమార్థాన్ని ఆశిస్తూ మనుచరిత్రను రాశాడు. మనుచరిత్రకూడా విశ్వశ్రేయస్సుని కాంక్షించినదే. ప్రబంధయుగానంతరం అంటే విజయనగరసామ్రాజ్య పతనానంతరం నాయక రాజులకాలంలో కవిత్వానికిగల దృక్పథం మారిపోయి భౌతికజీవితానందమే కవిత్వపరమార్థంగా రాజుల రతిక్రీడలే రసానందంగా పరిణమించింది. ఆధునిక కవిత్వంలో సామాన్యమానవుడు కథానాయకుడు కాగలిగాడు. అతని జీవితం, అతని కష్టసుఖాలు, బాధలూ, భయాలూ, వేదనలూ, కన్నీళ్లూ—ఇవన్నీ కావ్యవస్తువు లయ్యాయి. అంటే ఆధునికకాలంలో భావకవితానంతరం సామాజికదృష్టి సాహిత్యంలో ఎక్కువయినదని తెలుస్తోంది. సమాజంలో తనూ ఒక భాగంగా భావింపబడుతున్న కవి సమాజానికీ, దాని ఆలంబనమైన మనిషికీ అతీతమైన కవిత్వాన్ని రాసే స్థితిని అధిగమించి సంఘభావనకే కవిత్వంలో శాశ్వత విలువల్ని కలిగించాడు. శాశ్వతవిలువ లనేవి ఇతివృత్తం మీద ఆధారపడిలేవు. అభ్యుదయయుగసాహిత్యం, తదనంతరకాలకవిత్వంయొక్క పరమార్థం దోపిడీ చేయబడుతున్న మనిషిని కాపాడటం, నిద్రపోతున్న మనిషిని నిద్రలేపటం, తన శక్తిని సంఘశక్తిని మరచిన మనిషికి

గుర్తుచెయ్యటం. ఈ నాటి వచన కవిత్వం ఒకనాటి సంప్రదాయంమీద తిరుగుబాటే. అట్లాగే ఒకనాటి భావకవిత్వం అంతకు పూర్వం ప్రబంధ యుగంమీద తిరుగుబాటే. తిరుగుబాటు ప్రతికాలంలోనూ జరుగుతూంటుంది. అయితే ఎట్లా? ఏ మార్గంలో జరుగుతున్నది? అన్నవిషయమే సహృదయులు ఆలోచించవలసింది.

'ఒకానొక కవితారూపము సర్వరసనిర్వహణ సమర్థమని బుజువైనతర్వాత విభిన్నసిద్ధాంతాలను విశ్వసించే కవులు దానిని వాడుకోదలుచుకుంటే ఎవరూ ఆపరు. ఆధునిక కవుల్లో కొందరు దానిలో యితర రసములను వొప్పించడానికి ప్రయత్నం చేసినందువల్ల వారి ప్రగతివాదానికివచ్చిన బాధకూడా ఉండదు. మరొక ముఖ్యవిషయంకూడా గమనించవలసి ఉన్నది. ఈ వచనగేయకవితావిధానానికి వ్యామోహితులైగాని, లేక ఈ ఆధునిక కవితారూపంలో చెప్పితేగాని మనకుకూడా ప్రజామోదం రాదనే అభిప్రాయంతోగాని, లేక యిదిమనంమాత్రం రాయలేమా అనే చులకనభావంతోగాని ఎలాగైతేనేమి అనేకమంది పద్యకవితాభిమానులు యీ మార్గంలో వచ్చిపడ్డారు. ఈ మార్పు పది సంవత్సరాలకాలంలో బాగా జరిగింది. కానీ వీరు యీ మార్గాన్ని అవలంబించి రాయడం ప్రారంభించేసరికి వారు ఎంచుకుంటున్న కావ్యవస్తువుకూడ మారటం జరుగుతున్నది. నగర వర్ణనమనో, సామాన్యుని కథాగమనమనో ఏదోవిధంగా వారుకూడా ప్రగతివాదకావ్యవస్తువు వైపు ఆకర్షితులవుతున్నారు. ఈ విధంగా వచనగేయం ఒక తరం కవులకు ప్రతినిధిగానిల్చి పైతరంవారికి గూడా వ్యామోహం కలిగించిందంటే దానిలోగల జవసత్వాలవల్లనే అది సాధ్యమైంది. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో పెనవేసుకునిపోయిన నేటి కాలానికి నిజమైన ప్రతినిధిగా నిలిచినది వచనగేయకవితావిధానం.' (ఆంధ్ర పత్రిక సౌమ్యఉగాది ప్రత్యేక సంచిక.). కుందుర్తి ఈ అభిప్రాయాన్ని నిష్పాక్షికంగా పరిశీలిస్తే వచనగేయ కవితావిధానంయొక్క ప్రాముఖ్యం అర్థం అవుతుంది. వచనగేయం సర్వరససమర్థమైనదనే విషయాన్ని ఈ తరంలోని వచనకవిత్వం బుజువుచేస్తోంది. ప్రాచీన కవితాభిమానులైన కవులలో ఈనాడు ఎక్కువమంది కాకపోయినా గణనీయమైన సంఖ్యలోనైనా కొంతమంది కవులు వచనగేయాల్ని రాస్తున్నారు. అంటే వచనగేయ కవితావిధానంలోకూడా కావ్యత్వపువిలువల్ని వారు దర్శించగలిగిగారన్నమాట. ఏ ప్రక్రియపుట్టటానికైనా సరే మూలం వ్యక్తీకరణ విధానం. ఈ వ్యక్తీకరణ విధానం కవి చెప్పదలచుకున్న విషయంమీద ఆధారపడి ఉంటుంది. ప్రాచీన పద్ధతిలో కవిత్వం చెబుతూ ఆధునిక భావచేతనని ప్రతిఫలింప చెయ్యడం కష్టసాధ్యం. పోతే పూర్వ సంప్రదాయక మార్గంలో కవిత్వాన్ని ఇంతకు పూర్వం రాసి ఇప్పుడు ఆధునిక సంప్రదాయమైన వచనకవిత్వంలో కవిత్వం రాస్తున్న సంప్రదాయక కవుల కవిత్వంలో వస్తుపరమైన నవ్యత మనకు కనబడుతుంది. దీనివల్ల పాఠకులకు అర్థమయ్యే విషయం ఒకటుంది. ఒక్కొక్కభావానికి ఒక్కొక్కప్రక్రియ ఆధారమవుతుందని. చెప్పేభావాన్ని బట్టి తప్పనిసరిగా విధానం మారుతుంది. ఆధునిక భావాన్నికూడా ప్రాచీనపద్ధతిలో చెప్పవచ్చు అనుకోవడం, అనుకోవడంవరకూ బాగానే ఉంటుందిగాని ఆచరణ సాధ్యంమాత్రంకాదు. ఒకనాటి జనజీవితం సంప్రదాయానుకూలంగా సాగింది. ఆ జనజీవితవిధానానికి అనుగుణమైన సంప్రదాయ సాహిత్యం వర్ధిల్లింది. (అయితే ఆ సాహిత్యం సంప్రదాయాన్నే అంటిపెట్టుకునున్నదిగాని సాంఘికస్థితిని పట్టించుకోలేదు.)

పూర్వకాలంలో జనం బానిసలుగా బతికారంటే అతిశయోక్తికాదు. సాహిత్యంకూడా అంతకు పూర్వంఉన్న సంప్రదాయానికి బానిసై ఆ పరిధిలోనే వికాసమార్గాల్ని వెతుక్కుంది. ఆధునిక జీవితం స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో కూడుకునిఉన్నది. జీవితంలోని ఈ స్వేచ్ఛాస్వాతంత్ర్యభావన సాహిత్యంలోకికూడా ప్రవేశించి నూతన కవితారీతులకు దారితీసింది. ఈ విధంగా వ్యక్తి జీవిత విధానం, సాహిత్య సంప్రదాయం ఒకదానితోఒకటి ముడివేసుకొని ఉన్నాయి. జీవితంలో మార్పు సంభవించినపుడల్లా ఈ మార్పు సాహిత్యంలోకికూడా ప్రవేశిస్తోంది. ఈ పరిణామం అనివార్యమూ, బలవత్తరమూ అవటంవల్ల అవరోధాల్ని అధిగమించి ముందుకు సాగుతోంది.

'అవసరమనుకున్న దేనినీ పాతదని బహిష్క

రించేదిలేదు. అవసరం లేకుంటె సం(ప్రదాయంకదా అని నెత్తిన ఎక్కించుకునేదీలేదు. ఇది ఆధునిక యుగ లక్షణమా? ఏ యుగలక్షణమైన యిదే' అంటాడు కుందుర్తి వచనగేయం ఒక ఉద్యమం అనే వ్యాసంలో. ఈ అభిప్రాయంకూడా కుందుర్తికిగల చారిత్రక దృష్టిని వ్యక్తంచేస్తున్నది. కుందుర్తి ఏఒక్క ప్రక్రియని ద్వేషించినవాడుకాదు. అతను చెప్పేదల్లా ఈనాటి సమాజ జీవితానికి వచనగేయ కవితావిధానం సరైన ప్రతిబింబమనిమాత్రమే. పూర్వపు సాహిత్యాన్ని అతను కవిత్వంకాదని ఎక్కడా చెప్పలేదు. ఆనాటి కవిత్వాన్ని ఆనాటి పరిస్థితులనుబట్టి అంచనా వేయాలే గాని ఈనాటి పరిస్థితులనుబట్టికాదనేది అతని అభిప్రాయం. పూర్వపద్ధతిలో కవిత్వం ఈ నాటి భావ చైతన్యానికి ప్రతినిధిగా నిలబడలేదనేది అతని విశ్వాసం. అంతేగాని అది అతని అహంభావంమాత్రకాదు.కుందుర్తి వచన కవితా సంకలనానికి రాసిన పీఠికలు, చర్చా వేదికలకు సంబంధించిన వ్యాసాలు ఇంకా అనేకం ఉన్నాయి. అయితే వాటి నన్నింటినీ ఇక్కడ వివరించే అవకాశం లేదు. నేనిచ్చిన ఉదాహరణలద్వారా నేను చెప్పదలచుకున్న విషయం—కుందుర్తి ప్రత్యేకించి ఏ కవితా విధానాన్ని ద్వేషించిన వాడుకాదని, వచన కవితాభిమాని అవడంవల్ల అతనికి అహంభావంకాని, అతిశయంకాని లేదని.

నరసింహశాస్త్రిగారు వచన కవితా ప్రక్రియను గూర్చి రాసిన విషయాలుకూడా పరిశీలించవలసిన అవసరం ఉంది. ఆయన రాసిన అనేక విషయాలు పాక్షికంగా కనబడుతున్నాయేగాని గాఢమైన పరిశీలన వల్ల నిష్పాక్షికంగా చెప్పినవికావనే భావనవల్ల ఈ పరిశీలనకు పూనుకొనవలసి వచ్చిందిగాని అన్యభావనవల్ల కాదని సవినయంగా మనవి చేసుకుంటున్నాను.

'మరి చక్కని రాజమార్గాలైన ఛందోగేయ రచన లవలంబించక వాటిని వదలి ఒక నిర్దిష్టమైన విధానంలేక అగమ్యమైన అరణ్యంవంటిదో, దారిలేని ఎడారివంటిదో ఐన ఈ వచన కవితా ప్రక్రియ ఎందుకు వీరు అవలంబిస్తున్నట్లు? అని ప్రశ్నించారు నరసింహశాస్త్రిగారు. ఛందోబద్ధమైన ప్రక్రియ నిజంగా రాజమార్గమే కాబట్టి ఆధునిక కవులు దాన్ని వదలి ప్రజామార్గమైన వచన కవితా ప్రక్రియను చేపట్టారు. వచన కవిత్వానికి ఒక నిర్దిష్టమైన విధానం ఏదైనా ఉందా? అంటే వచన కవితా విధానం ఏ కవి కాకవియొక్క ప్రత్యేకతమీద ఆధారపడి ఉంది అని చెప్పవలసి ఉంటుంది. అంటే—ఆ కవి ఒక వచన గేయాన్ని రాసేటప్పుడు అతను ప్రదర్శించేశైలివిన్యాసం, భావానుగుణమైన శబ్ద వైచిత్రి, ఉద్రేకానుగుణమైన పాదాల విరుపు— ఇవన్నీ ఆ వచన గేయంయొక్క రూపావిష్కరణకి తోడ్పడతాయి. అంచేత వచన గేయంయొక్క విధానం కవి ప్రతిభనిబట్టి మారుతూ ఉంటుంది. అదే ప్రాచీన కవిత్వమైతే కవి ఏ వృత్తాన్ని తీసుకున్నా ఆ వృత్తానికి అవసరమైన నియమాలుముందే ఏర్పడి ఉంటాయి కాబట్టి ఆ నియమాల పరిధిలో కవి రసావిష్కరణకి ప్రయత్నిస్తాడు. వచన గేయానికి ఒక ప్రత్యేకమైన గమ్యం ఉంది. అది అగమ్యంవంటి అరణ్యంకాదు. ఏ పరిస్థితులలో వచన గేయం పుట్టిందో సక్రమంగా అవగాహన చేసుకున్నట్లయితే వచన గేయానికి గమ్యం ఉందో లేదో తెలుస్తుంది. వచనగేయంయొక్క దారి సుగమమైంది. నలుగురూ నడిచేదారేకాని నిర్జనమైన దారిలేని ఎడారివంటిది కాదు. వచనగేయం సమస్తమైన ప్రజానీకంకోసం పుట్టింది. వారి ఆనందమే దాని గమ్యం. వారి జీవిత విధానాన్నీ, వారి జీవితంలోని ఆశానిరాశల్నీ, వారిలోని నిస్తేజప్రవృత్తికి నివృత్తిని చూపడమే వచనగేయం యొక్క పరమార్థం.

'వచన కవితాభిమానులు మాదొక నూతన ప్రయోగమంటె; సహృదయులు కొంత సానుభూతితో దాన్ని పరిశీలించగలరు. కాని ఇది వచ్చినతరువాత వెనుకటి పద్యకవిత్వానికీ, గేయకవిత్వానికీ ప్రాచీనయుగావశేషాలుగానేతప్ప స్వయంగా కవిత్వంగా విలువ లేదంటే మాత్రము బుద్ధిమంతులెవరూ సమ్మతించేదికాదు.' వచనకవిత్వం నిస్సందేహంగా నూతన ప్రయోగమే. నరసింహశాస్త్రిగారు చెప్పినట్లుగానే దీన్ని సక్రమంగా అర్థంచేసుకునేందుకు, పరిశీలించేందుకు సహృదయత అవసరం. సహృదయత అనేది కవిత్వానికి సంబంధించినదికాని నియమాలకు సంబంధించినదికాదు. సహృదయు

డెప్పుడూ ఏకవిత్వం చెప్పినా, ఏవిధానంలో చెప్పినా చెప్పేది కళాత్మకమైన విలువల్ని కలిగిఉన్నప్పుడు తప్పనిసరిగా ఆనందిస్తాడు. నియమాలను ఉల్లంఘించినదికాబట్టి ఇది కవిత్వం కాదనే మనస్తత్వం ఉన్న ఏపాఠకుడూ, ఏపరిశీలకుడైనా సహృదయతకు చాలాదూరంగా ఉన్నట్లే. పోగా వచనగేయం ఈనాడు ఏకొద్దిమంది సానుభూతిమీదో ఆధారపడిలేదు.- ఆ విషయం రేడియోదగ్గర్నుంచి, దిన వార పక్ష మాస పత్రికలు, కవిసమ్మేళనాలు ఋజువుచేస్తున్నదే. పద్య కవిత్వం, గేయకవిత్వం ప్రాచీనయుగావశేషాలు అనేవారు ఆధునికమైన ఈ ప్రక్రియని తీవ్రంగా అభిమానించేవారు. అంతమాత్రంలో నరసింహశాస్త్రిగారు వచనకవిత్వంమీద తమ అభిప్రాయాల్ని వాస్తవానికి దూరంగా రాయవలసిన అవసరంలేదు. ఎంచేతంటే— వచనకవిత్వాన్ని తీవ్రంగా అభిమానించేవాళ్లకి పద్య కవిత్వం, గేయకవిత్వం, ప్రాచీన యుగావశేషాలుగా కనబడటానికి కారణాలు అనేకం. ప్రాచీన కవిత్వాన్ని తీవ్రంగా అభిమానించేవారు ఆధునికకవితాప్రక్రియల్ని అసలు కవిత్వమేకాదని బుకాయించడం నరసింహశాస్త్రిగారికి తెలియందికాదు. శ్రీ శ్రీ కవిత్వాన్ని బజారు పెసరట్టుతోను, ప్రాచీన కవిత్వాన్ని ఇంట్లో పెసరట్టుతోనుపోల్చి శ్రీ శ్రీ కవిత్వానికి శబ్దవైచిత్రేతప్ప కవిత్వపు విలువలు లేవని అన్నవారు లేకపోలేదు. దానికి ఆధునికులు ఏమనుకోవాలి? అలాగే నరసింహశాస్త్రిగారు కూడా ఆంధ్రప్రభ దినపత్రికలో ఒకసారి లేఖ రాస్తూ శ్రీ శ్రీ కవిత్వం చిత్రకవిత్వ స్థితిని దాటలేదన్నారు. చిత్ర కవిత్వమంటే దరిదాపుగా అధమ కవిత్వమనే అర్థంగదా! ఇది నిష్పాక్షికంగా వెలిబుచ్చిన అభిప్రాయమేనా? దీనికి ఆధునికులు React కారా? అయితే అది వారి దోషమా? ఒక పక్షాన్ని తీవ్రంగా అభిమానించేవాళ్ళు వెలువరించే అభిప్రాయాల్లో కొంతతీవ్రత ఉంటుంది. ఆ తీవ్రతని మాత్రమే ఆధారంగా జేసుకుని విమర్శకులు ప్రక్రియలకి విలువలు కట్టడం దోషం అంటున్నాను నేను.

'కవిత అనేది మహా సముద్రము. దానిలో మధ్య మధ్య బుడగలూ నురుగు తరకలూ తేరుకుని మెరిపించి మాయమవుతూ ఉంటవి. అట్లాగే కవిత్వంలో మధ్య మధ్య తలచూపే ఫాషన్లు కూడాను. 'పై పై మెరుగుల్ పచరింప దాని తిలకింపంబోరు ధీరోత్తముల్'. వచన కవిత్వము ఇప్పటికి సాధించినది చాలా స్వల్పము. విశేషమేదైనా భావిలో సాధించవలెనంటె ఇటువంటి అహంభావ ధోరణులు వదలిపెట్టి కావ్యదీక్షలో నిమగ్నులు కావలె.' నోరి నరసింహశాస్త్రిగారు కవిత్వాన్ని మహా సముద్రంగా ఊహించారు. ఆదికాలంనుంచీ ఇప్పటివరకూ వచ్చిన కవిత్వమంతా మహా సముద్రము. దానిలో బుడగలూ, నురుగుతరకలూలాంటివి అభ్యుదయ వచన కవిత్వాలు. ప్రాచీన సాహిత్యమంతా ఉదాత్తమైనదని ఏ సాహిత్య చరిత్రకారుడూ, విమర్శకుడూ చెప్పలేదు. పద్యకవిత్వమెంతో వచనకవిత్వముఅంతే. ఎన్ని నియమాల్ని ఏర్పరచుకుని కవిత్వంరాసినా ప్రాచీన సాహిత్యంలో ఎన్ని ఆధమకావ్యాలు లేవుగనుక. కవిత్వానికి ఛందస్సూ, అలంకారాలూ బాహ్యాడంబరతకు సంబధించినవని అస్మదాదుల అభిప్రాయం. ప్రాచీన సాహిత్యంలో కావ్యత్వపు విలువలులేని కావ్యాలున్నట్లుగానే వచన కవిత్వంలోనూ కవిత్వంకాని భాగం కొంత ఉండవచ్చు. ఒక రైతు ఉన్నాడు. సంవత్సరమంతా కష్టపడి వ్యవసాయం చేశాడనుకుందాం. పంట చేతికొచ్చింది. ఆ పంటలో పదోవంతో పదిహేనోవంతో పొల్లు ఉంటుంది. ఆ పొల్లుని తొలిగించి ధాన్యాన్ని తీసుకుంటాడే తప్ప పొల్లు ఉందిగదాఅని అసలుపంటను వదలిపెట్టడు గదా ! ప్రాచీన కవిత్వమైనా, వచనకవిత్వమైనా, అంతే. మంచి, చెడు అనేవి ప్రాచీనానికీ అర్వాచీనానికీ రెండింటికి సంబంధించినవి. పోతే వచన కవిత్వం ఇప్పటికి సాధించినది చాలాస్వల్పమన్నారు నరసింహశాస్త్రిగారు. ఇదికూడా సరైన అభిప్రాయం కాదు. ప్రాచీన కాలంలో ఒక సాహిత్య సంప్రదాయం కొన్నివందల సంవత్సరాలు నిలిచి ఏ పరమార్థాన్నైనాతే

సాధించగలిగిందో అలాంటి పరమార్థాన్నే వచన కవిత్వం అతిస్వల్పకాలంలో సాధించింది. వచన కవిత్వం పుట్టిన నాటినుంచీ ఇప్పటిదాకా అనేక పరిణామ దశలు గడిచిపోయాయి. ఈ పరిణామాలు కూడా ఆయాకవుల సైద్ధాంతిక దృక్పథాలమీద ఆధారపడి ఉన్నాయి. వచన కవిత్వం తొలితరంలో సామ్యవాద దృక్పథం ప్రధానభూమిక వహించింది. ఈ తరంలో వచన కవిత్వంలో ఎక్కువ వైవిధ్యం కనబడుతోంది. ఆ వైవిధ్యం ఈ క్రింది మార్గాల్లో వెల్లడవుతున్నది. 1. నిరాశావాదం 2. వ్యక్తివాదం 3. హింసావాదం 4. సామాజికప్రగతివాదం. ఈ నాలుగు వాదాల్లో వచన కవితా ప్రక్రియయొక్క వికాస స్వరూపాన్ని వివరించడం ఇక్కడ అప్రస్తుతం కనుక వదలివేస్తున్నాను. సహృదయుల్ని పరిశీలించమని కోరుతున్నాను.

'నిజానికి వచన కవితను అభిమానిస్తున్నవారు ఎక్కువభాగం పద్యకవితచెప్పే శక్తిలేక సులభసాధ్య మని ఈ ప్రక్రియ అవలంభిస్తున్నవారే. వారిలో పద్యకవిత కొంత చెప్పగలవారుకూడా ఉత్తమస్థాయి పద్యకవిత చెప్పిన వాళ్లు కారంటే అత్యుక్తికాదు.' సాధారణంగా చాలామంది సామాన్యులు అభిప్రాయ పడుతున్నట్లుగానే నరసింహశాస్త్రిగారు అభిప్రాయ పడటం విచారించవలసిన విషయం. శ్రీ శ్రీ, ఆరుద్ర, దాశరథీ, తిలక్, కుందుర్తి, నారాయణరెడ్డి వీళ్లంతా పద్యకవిత్వం రాసినవాళ్లు. అయితే అది ఉత్తమస్థాయి కవిత్వంకాదని నరసింహశాస్త్రిగారిఅభిప్రాయం. ఉత్తమ స్థాయి పద్య కవిత రాసిన కవిసామ్రాట్టులూ, మహాకవులూ ఉత్తమస్థాయి వచనగేయం రాయగలరా? ఆ ప్రక్రియకీ ఈ ప్రక్రియకీ ముడిపెట్టి దాన్ని దీంతోనూ, దీన్ని దాంతోనూ పోల్చడం అనవసరం. ఏప్రక్రియ కాప్రక్రియ స్వచ్ఛమైనదని భావించడం న్యాయం.

'సత్కవిత్వము ఉచిత ఛందోబద్ధమైనపుడు రాణించినట్లుగా అది లేనపుడు రాణించదు.' ఈ అభి ప్రాయం ఛందస్సుపైగల తీవ్రమమకారానికి సంబం ధించినదేగాని కవిత్వపువిలువలకి సంబంధించినదికాదు. కవిత్వానికి ఛందస్సు తప్పనిసరైన నియమంమాత్రం కాదు. ఎలా కాదో ఈ క్రింది రెండు ఉదాహరణల వల్ల ఋజువుచేస్తాను.

'ధారుణిరాజ్యసంపద మదంబునఁ
గోమలిఁ కృష్ణఁ జూచి రం
భోరు నిజోరు దేశమున నుండఁగ
బంచిన యిద్దురాత్ము దు
ర్వార మదీయ బాహు పరివర్తిత
చండగదాభిఘాత భ
గ్నోరు తరోరుఁ జేసెద సుయోధను
నుగ్రరణాంతరంబునన్'

పై పద్యం ఒకనాటి రాచరిక సామాజిక వ్యవస్థలో పట్టమహిషికితీవ్రమైన అన్యాయం జరిగి నపుడు ఆమె భర్త అమితబలపరాక్రమసంపన్ను డయ్యీ ధర్మానికి కట్టుబడి ఉండటంవలన తన ఉద్రేకాన్ని బహిర్గతం చేసినప్పటిది. ఈ పద్యం కొన్ని నియమాలకు లోబడిరాసినదే. ఆనాటి భావ స్వరూపం వేరుకాబట్టి తత్‌భావచైతన్యానికి అనుగుణ మైన శైలిలో సంప్రదాయమార్గంలో ఆ భావో ద్రేకం వెలికివచ్చింది.

ఈనాటి మానవునికి రాచరిక వ్యవస్థలోని బాధలు లేవుగాని దానికిమించిన బాధలు లనేకం. సమాజాన్ని ఈనాడు పాలిస్తున్నది ఆర్థికవ్యవస్థ. ఈ వ్యవస్థ మనిషిని మనిషినుంచి వేరుచేసి మనిషిని హంతకుడుగా పరమకిరాతకుడుగా తయారుచేస్తోంది. అధికారం ఆర్థికవ్యవస్థకి దాసోహం అన్నది. ఫలితం జనజీవితంలో అశాంతి. ఈ వ్యవస్థయొక్క స్వరూ పాన్ని ఈ నాటి కవి వచనగేయంలో చెబుతున్నాడు.

'విపరీత ధనదాహంతో నోరు తెఱచిన
వ్యక్తి పళ్లల్లో చిక్కుకుని ఎందరు మనుష్యులు!
పళ్లమధ్య వాణికిపోయే ఎన్నిసిద్ధాంతాలు!
చిగుళ్లనుండికారే ఎంత హత్యారుధిరం.

ఈ అస్తవ్యస్త భయంకర సామాజికస్థితిలో నుండి సమాజవృక్షానికి మూలంగాఉన్న మనిషి పుచ్చిపోయిన దశలోనుండి -

ఎన్నివిప్లవాలైనా బయలుచేరుతాయి
ఎంతరక్తపాతమైనా జరుగుతుంది.'

ఈనాటి భావానికి అనుగుణమైన కవితా ప్రక్రియగా పై వచనగేయపాదాలు [బుజువు చేస్తున్నాయి. మొదటి ఉదాహరణంలో నియమాలకు లోబడిన కవిత్వము రెండోఉదాహరణలో నియమాలను ధిక్కరించిన కవిత్వము కనబడుతోంది. మొదటి ఉదాహరణని వచన కవిత్వంలోగాని రెండో ఉదాహరణని సంప్రదాయక పద్య కవిత్వంలోనూ రాస్తే ఎంత వికృతంగా ఉంటుందో ఊహించడంకూడా కష్టం. కవితా శిల్పానికి తుది స్వరూపమనిగాని, పరిపూర్ణత అనిగాని ఉండదు. శిల్పానికి సంబంధించిన సాధన సామాగ్రి ఒక సంప్రదాయంనుంచి మరొక సంప్రదాయానికి వేరుకావచ్చు. ఇక్కడ టి. ఎస్. ఇలియట్ అభిప్రాయాన్ని ఉదహరిస్తాను'...art never improves, but that the material of art i never quite the same.'

'నేడు వచనకవిత సరికొత్త మోజు! అది తత్వమూకాదు, ఉద్యమమూకాదు. అది ఎక్కువ భాగము ఆదిప్రాసల అంత్యప్రాసల మాటల విరుపుల అసమానపాదాల మాటల పోటీల గారడీగానే ప్రధానంగా సాగుతున్నది. అది ప్రయోగదశను ఇంకా అధిగమించలేదు.' ఒక్క వచనకవిత్వమేకాదు. ప్రాచీన కాలంనుంచీ క్రొత్తగా వచ్చినదల్లా సరిక్రొత్త మోజుగానే సాగింది. నన్నయకాలంనాటికి తత్సమభాష మోజేకదా! శైవకవులనాటికి జానుతెనుగు మోజే కదా! ప్రబంధ కవులనాటి ఆలంకారికశైలి మోజు కాదా! నన్నయది వీరశైవులది మతపిచ్చి క్రింద, ప్రబంధసాహిత్యం సంభోగ శృంగారంక్రింద తోసిపారేస్తే ఎంతన్యాయమో నరసింహశాస్త్రిగారు రాసిన పై మాటలుకూడా అంతే న్యాయం. వచనకవిత్వం ప్రయోగదశను అధిగమించి సంప్రదాయంగా స్థిరపడింది. అమెరికన్ ప్రజాకవి వాల్ట్ విట్‌మన్ రాసిన రెండువాక్యాలు ఉదహరిస్తూ ఈ పరిశీలన వ్యాసాన్ని విరమిస్తాను. 'The message of the great poets to each man and woman is come to us on equal terms, Only then can you understand us, we are no better than you, what we enclose you enclose. what we enjoy you may enjoy.'

---



# తెలుగు - ఇటాలియన్

## శ్రీ యల్. మాలకొండయ్య

తెలుగుభాష 'Italian of the East', అనగా 'తూర్పునాటి ఇటాలియన్' అని Brown దొర, డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారలు చెప్పినప్పటి నుండి ఈ భావము ఆంధ్రదేశములో విరివిగా ప్రచారములో నున్నది. కాని, ఏకారణాలచేత తెలుగును 'తూర్పునాటి ఇటాలియన్' అంటున్నామో తెలుసుకోవడము అవసరముగనుక ఈ రెండుభాషల సన్నిహిత సంబంధాలనుగూర్చి క్లుప్తముగా ఈ వ్యాసములో వివరించ ప్రయత్నిస్తాను.

తెలుగులో 56, ఇంగ్లీషులో 26 అక్షరములుండగా ఇటాలియన్‌లో 21 అక్షరాలు మాత్రమే వున్నాయి. తెలుగుకు మూలము సంస్కృతములాగే, ఇటాలియన్‌కు మూలము లాటిను. సంస్కృతము—లాటినుభాషల సాన్నిహిత్యము అందరికీ తెలిసినదే.

ఇటాలియన్‌భాషలో ట, ఠ, డ, ఢ, థ, ధ—లు లేవు. వీనితో పనిలేదుకూడా. త, ద—లు మాత్రమే వున్నాయి. ట, డ—లు లేనందున ఆంగ్లములోని 'ఇటాలియన్' అనే పదము ఇటాలియనుభాషలో 'ఇతలియానో'అని, 'ఇటలీ'ని 'ఇతాలియా'అని 'ఇండియా'ను 'ఇందియా'అని ముఖ్యంగా 'తెలుగు'ను 'టెలుగు'అనిగాక 'తెలుగు'అని అంటారు.

ఇటాలియన్‌భాషకు లాటిన్ లిపి వాడుతారు. కాని, J, K, W, X, Y—అక్షరాలు ఇటాలియన్‌లో లేవు. ఆంగ్లములోని C, G—లు ఇటాలియన్‌లో స, జ—లుగా ఉచ్చరింపబడతాయి. C (స) కు, G (జ) కు h కలిపి దానితర్వాత ఎ, ఐ (E, I) లు వాడినప్పుడు స, జ—లు (అనగా C, G—లు) క, గ—లుగా మారుతాయి.

ఉ : Chiesa = కిఏసా = Church

Perche = పెర్కె = ఎందుకు

స, జ (C, G) ల తరువాత అ (a) వచ్చినపుడుకూడా అవి క, గ—లుగా మారుతాయి.

ఉ : Camera (కామెరా) = గది

Banca (బాన్‌కా) = బ్యాంకు

Gatto (గాత్తో) = పిల్లి

జ (G) కు నకారము (n) కలిస్తే 'న్య' అవుతుంది.

ఉ : Bagno (బాన్యో) = స్నానము.

స (C) కు ఏ, ఐ—లు (E, I) కలిసినప్పుడు 'చ'గా మారుతుంది.

ఉ : Cinema (చినెమా) = సినిమా

Cento (చెంతో) = నూరు

Fiat కారుపై వ్రాసియున్న 'Mille Cento' (మిల్లెచెంతో) అంటే 'వెయ్యిన్ని నూరు' అనగా Fiat 1100 అని.

ఇంగ్లీషు 'I' (ఐ) ఇటాలియన్‌లో 'E' (ఇ). ఐ, ఔ—లు ఇటాలియన్‌లో లేవు.

ఇకార, ఉకార, ఎకార, ఒ కారములకు ఇటాలియన్ భాషలో దీర్ఘములులేవు. కాని 'stress' అనగా 'ఒత్తి పలకటం' వుంది. కొంత భాషా పరిచయముంటే ఇది తెలుసుకోవచ్చు.

ఈ కొద్ది భాషాపరిచయ వాక్యాలతో తెలుగు భాషను, ఇటాలియన్ భాషతో పోల్చడానికిగల కారణాలేమిటో తెలుసుకుందాము.

మొదటిది : తెలుగు, ఇటాలియన్, రెండు భాషల్లోకూడా ప్రతిపదము అచ్చులతో అంతమవుతుంది. ఇది అతిముఖ్యమైన కారణము:

ఉదాహరణకు కొన్ని పదాలు: (వీలైనంత వఱకు తెలుగుతో కొన్ని పోలికలున్న అజంతాలు ఉదహరించ బడినవి)

కార్తా = కాగితము ;
సాలా = శాల (గది) :
దోదిచి = ద్వాదశి (పన్నెండు) ;
సువాయి = స్వయము; స్వంతము ;
త్రె = త్రయము - మూడు ;
నొవె = నవ—తొమ్మిది ;
Casa (కాసా) గృహము;
బాన్యొ = స్నానము ;
Buana (బువన) = మంచి ;

తబాక్కో = తంబాకు
తంబురో = తంబూరా
పియదె = పాదము
దుయె = ద్వయము—రెండు
శెత్తె = సప్త — ఏడు
త్రదుత్రె = తర్జువా
Citta (చిత్తా) = నగరము
అక్వా = నీరు
బార్కా = పడవ

రెండవది: వ్రాసిన ప్రతి అక్కరము, గుణింతాలతో సహా, 'తు, చ' — తప్పకుండ ఈ రెండు భాషల్లో పలుకబడతాయి.

| ఉ. | ఇటాలియన్ | తెలుగు |
|---|---|---|
| | Posso (పోస్‌సో)— | అక్షరము |
| | Terrezz (తెర్రెత్స్‌త్సా) | సంక్షేమము |
| | Pizza (పిత్స్‌త్సా) = అట్టు, దోశ; | సంస్కృతి |
| | Biblioteca (బిబ్లియోతీకా) | స్మృతి |
| | Commenciare (కామ్మెన్ చియారె) | చిహ్నము |
| | Grazie (గ్రాత్సియె) | జ్ఞానము |
| | F[illegible] ra (ఫినెస్త్రా) | ప్రహ్లాదుడు |
| | Naturalmante (నాతురాల్ మెన్‌తి) | మత్స్యము |
| | Viaggiare (వియాజ్జియారె) | ఆహ్లాదము |
| | Gina Lollobrigida (జినా లొల్లొ బ్రిజిడ) | |

అనేకభాషలలో వ్రాసిన అక్షరమొకటి, చదివేది మరొకటిగాను వుండుట కలదు.

ఉ: ఇంగ్లీషు

Put = పుట్; But = బట్
Wait, Weight, Light, lite
Bit, Bite, Director (డైరెక్టర్)
Live–Life; Calf–Cough; Folk (ఫోక్)

ఫ్రెంచి:

'డూప్లెక్సు' అని వ్రాసి 'డూప్లే' అని, 'పారిస్' అని వ్రాసి 'పారి' అని చదువవలసివుంటుంది.

తమిళం:

'క, చ, ట, త, ప'-లు, 'గ, జ, డ, ద, బ'-లు శ, సహ — లు ఏవి, ఎక్కడ, ఎట్లు, ఉచ్చరించాలో, ఎంతో అనుభవము గడిస్తేనేగాని భాషేతరులకు అవగాహనముకాదు.

ఉ: కందసామి, గందసామి, కంతసామి, గంతసామి, కందజామి, గందజామి, కంతచామి, గంతచామి; కాంది, గాంది, కాంతి, గాంతి.

రష్యన్:

'తవారిష్' (Comrade) లో 'ష' పదాన్ని

తొలుత వచ్చినప్పుడు 'త'గానే పలకాలి. పదములో మొదటి అక్షరము తరువాత వచ్చినప్పుడు 'చ'గా మారుతుంది.అలాగే'ద', 'జ'—గా మారుతుంది.

ఉ : గవరితీ (మాట్లాడు) అని 'తీ' అని వ్రాసి 'చీ'గా చదువవలసివుంటుంది.

అలాగే, 'ద'—'దివాన్' (సోఫా)లో 'ద' గా వుండి, 'గిదే' (ఎక్కడ)లో 'జే'గామారి 'గిజె' అవుతుంది. హైదరాబాద్, ఖైదరాబాజ్ అవుతుంది.

**జర్మన్ :**

'Kind' (కింద్=శిశువు)లో 'd' 't'గా మారి 'కింద్'గా గాక 'కింట్' అని పలుకవలెను. అలాగే 'Land' (లాండ్)ను 'లాంట్'గా చదువవలెను. కాని 'Kindergarten' లో 'd' 'd' గానేవుండి 'కిండర్ గార్టెన్' అని చదువవలెను. ఇంగ్లీషులోవలెగాక 'Folk' ను 'Volk' అని వ్రాసి 'ఫోల్క్' అని పలుకవలెను.

ఇటాలియన్, తెలుగు — అజంతల భాషలు గనుక ఉన్నదున్నట్లు పలుకబడును గనుక తమిళం లోని 'అయ్యావామి'ని 'అయ్యాస్వామి' అని; 'వెంగడేజన్'ను 'వెంకటేశన్' అని రష్యన్‌లోని 'గవరిచే'ను 'గవరితె' అని ఇంగ్లీషులోని 'Girls' ను 'గరల్సు', ఇంకా 'దట్సు', 'దిస్సు'; 'గవర్నమెంటు', 'ఫాదరు' 'మదరు', 'వాటరు', 'మిల్కు', 'బుక్కుషాపు' అని పలుకుతాము.

మూడవది : మరొక భాషనుండి పదజాలాన్ని తెలుగులోనికి అరువు తెచ్చుకుని వాడుకోవాలంటే 'డు, ము, వు, లు' చేర్చవలసిగాని అజంతాలుగా మార్చుకోవలసిగాని వుంటుంది. ఇటాలియన్ భాష నుండి తెలుగులోనికి, తెలుగునుండి ఇటాలియన్ లోనికి పదములను అరువు తెచ్చుకోవలసి వచ్చినప్పుడు అట్టి అవసరములేదు.

| ఉ : | ఆంగ్లము | ఇటాలియన్ | తెలుగు |
|---|---|---|---|
| | Christ (క్రైస్ట్) | క్రీస్తు | క్రీస్తు |
| | David (డేవిడ్) | దావీదు | దావీదు |
| | Mary (మేరి) | మరియ | మరియ |
| | Sister (సిస్టర్) | Sorella (సొరెల్లా) | సోదరి |

తెలుగులో సోరెల్లా అనవచ్చు గాని 'సిస్టరు' అనాలి.

ఇటాలియన్ భాషలో 'Brown'ను 'Bruno' గాను, 'Pen'ను 'Penna' గాను మార్చుకోవాలి— తెలుగులో 'బాంబు', 'పెన్ను', 'బ్రౌను' మాదిరిగ. అలాగే తమిళంలో 'వాయ్' (నోరు) 'వాయి' గాను, 'పొయ్' (అబద్దం) 'పొయ్యి'గాను, హింది, సంస్కృత భాషలలోని 'ఆకాశ్', 'ప్రకాశ్'లను, 'ఆకాశము', 'ప్రకాశము'లు గాను మార్చుకోవాలి.

నాల్గవది : ఇటాలియన్, తెలుగుభాషలు చాలా మృదు మధురమైనవని, వీనులకు వినసొంపుగా, వుంటాయని అంటారు. కాని, ఇతర భాషలవారు దీని నొప్పుకోవడం కష్టము. ఎందుకనగా ఎవరిభాష వారికి, వినసొంపుగాను అతిమధురంగాను వుంటుంది. ఇందులోని నిజమేమంటే, 'తెలుగు', ఇటాలియన్ భాషలు అజంతములు కావున ప్రతిపదము పూర్తిగా ఉచ్చరింపబడి, చివరి అక్షరము గాలిలో కలిసి పోకుండా, విశదముగా వుంటుంది. అట్టిపదములు ఏ భాషలోవున్నా ఈ గుణాలే కలిగివుంటాయి. కాని ఈ రెండు భాషలు పూర్తిగా అజంతాలు గనుక వినుటకు ఇంపుగా వుంటాయి.

ఇటాలియన్—తెలుగు భాషలకుగల మరికొన్ని పోలికలు:

తెలుగు నామవాచకాల్లో స్త్రీ లింగము 'అమ్మ' అని, పుంలింగము 'అయ్య' అని అంతమైనట్లే, ఇటాలియన్‌లోకూడా స్త్రీలింగము 'అ'తోను, పుంలింగము 'ఓ'తోను అంతమవుతాయి.

ఉ. : 'సీతమ్మ' — 'సీతయ్య'లాగ 'మరియ' (మరియమ్మ).

'మారియొ' (మరియయ్య); అలాగే
అబ్బాయి=రగాచ్చొ, అమ్మాయి=రగాచ్ఛా;
అమికొ=మిత్రుడు. అమికా=మిత్రురాలు;
అమిచి=మిత్రులు.

తెలుగులోవలె 'కొంటాను' 'అమ్ముతాను' అంటే 'నేను కొంటాను', 'నేను అమ్ముతాను' అని 'నేను' అనే పదము లేకుండానే అర్థము వస్తుంది. ఆంగ్లములో "Buy", 'Sell' అంటే ఎవరు అమ్మేది, ఎవరు కొనేది అర్థముకాదు. 'I buy' 'you sell' అని 'నేను', 'నువ్వు' అన్న పురుషవాచకం (person) వాడవలసి వుంటుంది.

ఉ. Vendo Una Vacca = (అంటే 'io' నేను—వాడకుండానే) ఒక ఆవును అమ్ముతాను.

Campeo Una gatto= ఒక పిల్లినికొంటాను.

ఇంగ్లీషులోవలె 'I speak', 'you speak', 'he, she, it—speaks, we speak, you speak, they speak అన్నట్లుగాక, తెలుగులోవలె, ఇటాలియన్‌లో ప్రతివచనమునకు క్రియమార్పుచెందుతుంది.

---

ఉ : Io parlo (ఇయొ పార్లొ) = నేను మాట్లాడుతాను.
tu parli (తు పార్లి) = నీవు మాట్లాడుతావు.
egli / ella } parla— ఎల్లి / ఎల్లా } పార్లా = అతను / ఆమె } మాట్లాడుతారు.
Noi parliamo (నోయి పార్లియామొ) = మనము మాట్లాడుతాము.
Voi parlate (వొయి పార్లతే) = మీరు మాట్లాడుతారు.
essi / esse / loro } parlano— ఎస్సి / ఎస్సె / లోరొ } పార్లనొ = వారు (స్త్రీ, పురుష) మాట్లాడుతారు.

---

తెలుగులో ఏకవచనమును, బహువచనముగా మార్చుటకు 'లు' చేర్చినట్లు, ఇటాలియన్‌లో 'ఇ' (ఇంగ్లీషులోని 'I') చేర్చవలెను.

ఉ : Giovanni (జియొవాన్ని) = జానులు.

Marconi (మార్కొని) = మార్కొనులు (తెలుగులో) సోములు, రాములులాగ, ఇంగ్లీషులో Williams (విలియమ్సు) వలె.

Vacca (వాక్కా) = ఆవు Vacci (వాక్కి)= ఆవులు.

Bambino (బంబినొ) = శిశువు = Bambini (బింబిని) = శిశువులు,

Sphagetti (స్పగెట్టి) = జంతికలు.

Madre (మాద్రె) = తల్లి; Madri (మాద్రి) = తల్లులు,

Padre (పాద్రె)=తండ్రి; padri (పాద్రి) = తండ్రులు.

ఇంగ్లీషులో 'నీవు' అనే దానికి, 'మీరు' అనే బహువచనమునకుకూడ 'you' అనే పదాన్ని వాడుతాము. తెలుగులో 'నీవు', 'మీరు', 'తమరు' వలె ఇటాలియన్‌లో 'tu' (తు) =నీవు, 'Voi' (వొయి)= మీరు, 'lei' (లెయి) = తమరు అని అంటారు.

తెలుగు ఇంగ్లీషులలోవలెగాక 'ఎందుకు' (Why), ఎందుకనగా (because) అనే రెండు పదములకు ఇటాలియన్‌లో 'perche' (పర్కె) అనే ఒక

పదాన్నే ప్రశ్నకు, జవాబుకుకూడా వాడుతారు. ఇది ఇటాలియన్‌లో ప్రత్యేకత.

తెలుగు, ఇటాలియన్ భాషలకు సామీప్య సంబంధాలు మెండుగా వున్నవని, మరి ఏ ఇతర రెండు ఐరోపా, ఆశియా భాషలలో ఇట్టి సన్నిహిత్యములేదని చెప్పవచ్చును. ఈ సన్నిహిత్యము వలన తెలుగువారు 'ఇతలియనొ' నేర్చుకొనుటకు 'ఇతలియాని' (ఇటాలియనులు) తెలుగు నేర్చుకొనుటకు బహు సులభము. ముఖ్యంగా ప్రత్యక్ష శిక్షణలేకుండా పుస్తకములద్వారా నేర్చుకొనుటకు కూడా అనువుగా వుంటాయి. ఇందుకు ముఖ్య కారణము, వ్రాసినది వున్నదున్నట్లుగా పలుకుటే. గుణింతాలన్నీ (ఇటాలియన్‌లో కొన్ని లేకపోవటంతప్ప) ఈ రెండు భాషల్లోనూ ఒకే విధంగా ఉచ్చరించ బడతాయి. పరభాషీయులకు సాధారణంగా కొత్తభాష నేర్చుకునేటప్పుడు ప్రత్యక్ష శిక్షణలేకుండా వ్రాసినది పలుకుట బహు కష్టం.

ఉ: ఫ్రెంచి, స్పానిష్, తమిళ, రష్యన్ భాషలు—

తమిళంలో 'కళగం' లోని 'ఴ' (shaza), రష్యన్‌లోని 'తోజ' లోని 'gsha' (జ) ను ఇతర భాషలలో వ్రాయలేము.

తెలుగు ఇటాలియన్ భాషల సన్నిహిత్యాన్ని గూర్చి విన్నవించుట కీ అవకాశ మిచ్చినందులకు Mille Grazie (మిల్లె గ్రాత్సియె) అనగా వెయ్యి వందనములు.

Auguri (అవుగురి) = శుభం.

Arrivederla. (అర్రివెదెర్ల) = శలవు.



# తప్పు చెయ్యనివాడు

శ్రీ పణతుల రామచంద్రయ్య

ఆర్తనాదం కర్ణపేయంగా లేదని
అంతంత దూరంగా తొలగిపోతే ఎలాగ ?
బాధను దగ్గరికి రానివ్వటం అంతగొప్ప తప్పని
పాపం, అతడు తెలుసుకోలేదు ముందుగా.

వార్షికాభ్రమధ్యంలో ఆ సాయంత్రం ఎక్కడో అశనిపాతం జరుగుతుందని
వారూ వీరూ చెప్పటం అతడు వినకపోలేదుగాని-
అనుకున్నాడు, ఊరిచివర శిథిలాలయం దాన్ని అందుకుంటుందని.
అనుకోలేదు, తన ఆనందాలప్రోవు భస్మీభూత మవుతుందని.

వెనువెంటనే పదివేల నిలువుల ఎత్తున తనచుట్టూ కోపంగా
విజృంభించిన నిరాశాకల్లోలిని ఏమంత లోతులేదని
అతడనుకుంటే, ఆధారం కోసం ఒకతృణాంకురం అందుకుంటే,
అనగలరా మీరు, అదికూడా తప్పని ?

అంగద్రొక్క బడబోతున్న బలిచక్రవర్తి ఎదురుగా
తనువు పెంచి ఇంతింతైన వామనుడిలాగ
ఆ తృణాంకురం పెద్ద పడవగా రూపొందుతున్నట్లు
అతడి కెందుకో భ్రాంతి కలిగిందట.
అకారణంగా ఆగామిశుభోదయంపై
ఆశలు గొలిపిందట.

తీరమేదీ యీ లోపున కంటికి తగలదని
తీరా ప్రయాణమైనాకగాని తెలిసిరాలేదు.
ఒకమేఘం మరొక మేఘానికిచ్చిన ముద్దులు ప్రేలివ గగనంలోం
సుకుమారమైన స్త్రీహస్తమేదీ అతణ్ణి వెన్నుతట్టటంలేదు.

సముద్రంగా మారే నీటిమీద ఒంటరిగా ఎగిరే నీటికాకి అరుపుల్లో
శబ్దించే అశాంతి యింకా తగ్గుముఖం పట్టటంలేదు

అతడి తల వాలిపోతుందిక.
అతణ్ని ఆవరిస్తుంది బడలిక.
కాని తాత్కాలికంగా పలకరించే కునుకుపాట్లు
కలల పరదాలను దించుతాయి అతడి చుట్టూ.

ఆ కలల్లో అతడికి మసకగా
ఆకారాలేవో కనిపిస్తే
ఎంత కష్టం!
అతడి ఆనందం కాలిపోయిన మైదానాన్ని
ఆక్రమించుకుంటామనీ ఆ ఆకారాలు చెబితే
ఎంత కష్టం!

అయ్యలారా! ఈలోగా ఏదో ఒక తీరాన్ని
అతడికి దగ్గరగా తీసుకెళ్లండి.
అతడి పెదాలకు హాసవిలేపనం చెయ్యండి.
ఆనుకుని సేదతీర్చుకోవటానికై
అతడి పక్కన ఒక చిన్న ప్రభాతాన్ని అమర్చండి.

---



# "ఆంధ్ర సంస్కృతకోశము - ఒక సమీక్ష"

శ్రీ ఆర్. శ్రీహరి

అచ్చతెలుఁగు పదములకు సంస్కృత పర్యాయపదములు చూపు కోశము తెలుగున నింతవరకు ఒక్కటికూడలేదు. ఇట్టి కొఱఁతను 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు 'ఆంధ్ర సంస్కృత కోశము'ను ప్రకటించి తీర్చి ఆంధ్రలోకమునకు గొప్పఉపకారము చేసినారనుట అతిశయోక్తికాదు. అకాడెమీ కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు తమ తొలిపలుకులో ఈ కోశము విద్యార్థులకేకాక ఉభయ భాషాభిమానులకును ఉపయుక్తముగా నుండునని యథార్థవిషయమును తెలిపినారు. ఈ కోశమును మును శ్రీ డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు కూర్చినారు. వీ రిందులో తెలుగుపదములకు కేవలము సంస్కృత పర్యాయపదములను చూపుటయేకాక ఆయాసంస్కృత శబ్దముల లింగమును, మరియు నాయాధాతువులకు క్త, క్తవతు, క్త్వా మున్నగు ప్రత్యయములను చేర్చినపు డేర్పడు రూపములను, ఆయాధాతువుల గణములను చూపినారు. ఇట్లు చూపిన రూపములలో కొన్నింటిని స్థాలీపులాకన్యాయముగా ఈ వ్యాసములో సమీక్షించుచున్నాను.

1. ఆను (పేజి. 53) భుజ్ (7 గ. భునక్తి, భుంక్తే.)

తిను అను నర్థమున 'భునక్తి'అను పరస్మైపదరూప మసాధువు: 'భుజోఽనవనే' (1—3—66) అను సూత్రమువే అవన (రక్షణ) భిన్నార్థమున భుజ్ధాతువుపై ఆత్మనేపదము నిత్యముగ విధింపఁబడినది. (చూ. సిద్ధాంత కౌముది. 'భుజోఽనవనే'. అనవనేకిమ్? మహీంభునక్తి; ఓదనం భుంక్తే.)

2. ఆమతించు (పే. 54) నిమంత్ర్ (10 గ. మంత్రయతి—త్రిత—త్రితుమ్.)

మంత్రధాతు వాత్మనేపది యగుటచే మంత్రయతే అను రూపమును చూపుట యుక్తము. కొన్నిచోట్ల పరస్మైపదరూపము లున్నను ఆత్మనేపద ప్రయోగమే ప్రసిద్ధము. 'లక్ష్మ్యైనిమంత్రయాంచక్రే'అని కాళిదాస ప్రయోగము.

తుమున్ప్రత్యయాంతముగ చూపఁబడిన 'నిమంత్రితుం' అనునది అసాధువు. నిమంత్రయితుం అను రూపము సాధువు. 'నహి స్త్రీభిఃసహ మంత్రయితుం యుజ్యతే'అని పంచతంత్ర ప్రయోగము.

3. ఆలకించు (పే. 58) శ్రు—(5 గ. శ్రుణోతి—శ్రోతుం—శ్రుత.)

శ్రు = శ్రవణే అను ధాతువు ఐదవ (స్వాది) గణములోనిదికాదు. భ్వాదిగణములోనిదే. భ్వాదిగణధాతువులపై రావలసిన శప్ ప్రత్యయమునకు అపవాదముగ నీ ధాతువుపై శ్నుప్రత్యయము విధింపఁబడినది. శ్నుప్రత్యయముతోఁబాటు 'శ్రు' అనుదానికి 'శృ' అను ఆదేశమును విధింపఁబడినది. కనుక శ్రుణోతి అను రేఫయుక్తరూపమునుకాక 'శృణోతి' అను ఋత్వసహితరూపమును చూపవలెను. (చూ. సి. కౌ. 'శ్రువః శృ చ',—3—1—74; శ్రువః శృ ఇత్యాదేశః స్యాత్ శ్నుప్రత్యయశ్చ— శపోఽపవాదః.)

4. ఉక్కబట్టు (పే. 75) హా (2 గ. జహాతి హాతుం—హీన; 3 గ. జహీతే హాతుం—హీన.)

జహాతి అనునది ఓహాక్=త్యాగే అను ధాతువు

లఙ్రూపము. ఈ ధాతువు రెండవగణములోనిదికాదు. మూడవదగు జుహోత్యాది గణములోనిది.

జహీతే అనునది ఓహాఙ్ గతౌ అను ధాతువు రూపముగ చూపఁబడినది. ఇట 'భృఞామిత్' అను సూత్రముచే అభ్యస్తాకారమున కికారాదేశము రాగా 'జిహీతే'అను రూప మేర్పడును. ఈ ధాతువు క్త ప్రత్యయరూపము హాన అనికాని 'హీన'కాదు.

**5.** ఈను (పే. 72) సు. (1 గ. సవతి-సవితుం సవిత. 2 గ. సౌతి—సోతుం—సూత)

సవతి, సౌతి అను పై రెండు క్రియా రూపములకును 'షు' ధాతువు ప్రకృతి. ఈ ధాతువునకు ఈను అను నర్థములేదు. 'షు = ప్రస వైశ్వర్యయోః' అను చోట ప్రసవ శబ్దమునకు అభ్యనుజ్ఞాన—మను నర్థము చెప్పఁబడినది. (చూ. సి. కౌ. ప్రసవో౽భ్యనుజ్ఞానమ్.)

కనుక ఈను అను నర్థమున సూయతే అను 'షూ' ధాతువు రూపమునుచూపుట యుక్తము.

**6.** ఊఁదు (పే. 87) వద్ (1 గ. వదతి, వదితుం, ఉక్త)

వద ధాతువు క్త ప్రత్యయరూపము 'ఉదిత' అనియే కాని ఉక్త అనికాదు. ఉక్త అనునది వచ్ ధాతువు క్త ప్రత్యయరూపము.

**7.** ఒట్టు (పే. 109) శపథః, శాపః, పనమ్.

ఇట శాపః అను పదము తరువాత పనం అని చూపుటచే 'శాపనం' అనునది శాపపర్యాయ వాచక మని తెలియుచున్నది. శప్ ధాతువుపై ల్యుట్ ప్రత్యయమురాగా 'శపనమ్' అను రూపమే కాని 'శాపనం' అనునది సిద్ధించదు. శపనమ్ అను రూప మును పూర్తిగా చూపినచో బాగుండెడిది.

**8.** ఓరుచు (పే. 118) క్షమ్. (1 గ. క్షమతే—తి క్షంతుం—క్షాంత)

మొదటి గణములోని క్షమ -ధాతువు ఆత్మనే పది కనుక 'క్షమతి' అను పరస్మైపదరూపమును చూపుట యుక్తముకాదు.

క్షమ్ ధాతువు నాలుగవ (దివాది) గణములో కూడ నుండుటచే 'క్షామ్యతి' అను రూపమును గూడ చూపిన బాగుండెడిది.

**9.** కల (పే. 139) స్వప్నమ్, సుప్తజ్ఞానమ్.

స్వప్న శబ్దము నపుంసకలింగ శబ్దముకాదు. అది పుంలింగమునందే ప్రసిద్ధము. స్యాన్నిద్రాశయనం స్వాపః స్వప్నః సంవేశ ఇత్యపి' అని నా. లిం. అ.' 'స్వప్నోను మాయాను' అను శాకుంతల ప్రయోగము నను పుంలింగపదమే ప్రయుక్తము. (చూ. నజంతః-' పాణినీయఃలింగానుశాసనము)

**10.** కుంటి (పే. 157) పంగుః—పంగుః — పంగు.

ఇట స్త్రీలింగమునను 'పంగుః' అనియే చూపఁబడినది. స్త్రీలింగమున పంగు శబ్దముపై పంగోశ్చ (4—1—68) అను సూత్రముచే ఊఙ్ ప్రత్యయమువచ్చి 'పంగూః' అని యగును. కనుక స్త్రీలింగరూపముగ 'పంగూః' అని చూపుట యుక్తము.

**11.** కుచ్చెతీయు (పే. 158) నిశో (శ్యతి—శాతుం—త)

ఇట నిశాత అను రూపముతోఁబాటు నిశిత అను క్త ప్రత్యయాంతరూపమునుకూడ చూపుట యుక్తము. (చూ.సి.కౌ. 'శాచ్ఛోరన్యతరస్యామ్-' అనయో రికారాంతాదేశో వా స్యాత్ తానౌ కితి—శితః శాతః.)

**12.** కోరు (పే. 178) ప్రార్థ—(అర్థయతే—అర్థయతి)

అర్థధాతు వాత్మనేపది యగుటచే అర్థయతి అను పరస్మైపదరూపమును జూపుట యుక్తము కాదు. 'తేన భవంతం ప్రార్థయతే, (శాకుంతలము); స్వర్గతిం ప్రార్థయంతే, (గీత), ధ్వనతః ప్రార్థ

యతే మృగాధిపః (భారవి)— ఇత్యాది ప్రయోగములలో ఆత్మనేపదరూపమే ప్రసిద్ధము.

**13.** కోలుపాటు (పే. 181) వ్యయమ్.

వ్యయశబ్దము పుంలింగమున ప్రసిద్ధము. 'అర్థ స్యాపగమే వ్యయః' అని నా. లిం. అ.

**14.** గాఁడిగడుగు (పే. 194) చి (5 గ. చినోతి చేతుం - చిత.)

చిఞ్ చయనే అను ధాతువుభయపదియగుటచే 'చినుతే' అను నాత్మనేపదరూపమునుఁగూడ చూపుట యుక్తము.

**15.** గాఁడు (పే. 194) అంకురాదీన్ ఆరుహ్ (ప్రే. ఆరోపయతి)

రుహ్ ధాతువులోని హకారమునకు ణిచ్చు పరమగునపుడు పకారాదేశము వైకల్పికమగుటచే ఆరోపయతి అనురూపముతోఁబాటు ఆరోహయతి అనురూపమునుఁగూడ చూపవలసియున్నది. (చూ. సి. కౌ. 'రుహః పోఽన్యతరస్యామ్' 7—3—43—ణౌ—రోపయతి, రోహయతి.)

**16.** గుద్దలించు (పే. 202) ఖనతి - ఖనితుం — త.

ఖను = అవదారణే అను ధాతువుభయపదియగుటచే ఖనతే అను రూపమునుఁగూడ చూపుట యుక్తము.

క్త ప్రత్యయమున 'ఖనిత' అను రూపమసాధువు. ఖాత అనునదియే సాధురూపము. (చూ. సి. కౌ. 'జనసనఖనాం సఞ్ఝలోః' 6—4—42—ఏషామాకారోఽన్తాదేశః స్యాత్ ఝలాదౌ సని ఝలాదౌ క్ఙితి చ.)

**17.** గుబ్బతిల్లు (పే. 203) పరిభ్రమ్ (1 గ. భ్రమతి. 4 గ. భ్రమ్యతి — భ్రామ్యతి.)

ఇట భ్రమతి అను నొక రూపమే భ్వాదిగణములోనిదిగ చూపఁబడినది. కాని భ్రమ్యతి అను రూపముగూడ మొదటి గణములోనిదే. 'వా భ్రాశభ్లాశభ్రము' ఇత్యాది సూత్రముచే భౌవాదికమగు భ్రముధాతువుపై శ్యన్ ప్రత్యయమురాగా భ్రమ్యతి అను పై రూపము సిద్ధించును. కనుకనే సి. కౌ. లో భ్రమ్యతి, భ్రమతి అను రెండు రూపములను భ్వాదిగణములోఁ జూపుచు 'భ్రామ్యతి ఇతితు దివాదేర్వక్ష్యతే' అనుటచే భ్రామ్యతి అను రూపము మాత్రమే దివాదిగణమునకు చెందినదని తెలియుచున్నది.

**18.** చాయవారు (పే. 220) అక. సదృశః— శా—శం—భూ.

సదృశ శబ్దమునకు సదృశా అనికాక సదృశీ అనునది స్త్రీలింగరూపము. సదృశ్ అనుచోట దృశ్ ధాతువుపై 'దృశోఽనాలోచనే కఞ్చ' అను సూత్రముచే కఞ్ ప్రత్యయమురాగా సదృశ అని యగును. కఞ్ ప్రత్యయాంతమగుటచే దీనిపై స్త్రీత్వవివక్షయందు 'టిడ్ఢాణఞ్...కఞ్క్వరపః' అను సూత్రముచే ఙీప్ ప్రత్యయమురాగా 'సదృశీ' అనియే యగును. సదృశా అనికాదు.

**19.** చెట్టవట్టు (పే. 233) ఉపయమ్ (1 గ. యచ్ఛతే, తి—యమతే—యంతుం—యత.)

చెట్టవట్టు అను నర్థమున 'ఉపయచ్ఛతి' అను పరస్మై పదరూప ముండదు. (చూ. సి. కౌ. 'ఉపాద్యమః స్వీకరణే' (13—56) భార్యాముపయచ్ఛతే). 'భవాన్మిథఃసమయా దిమా ముపాయంస్త (శాకుంతలము)'. ఆత్మానురూపాం విధినోపయేమే' ఇత్యాది స్థలములలో ఉపాయంస్త, ఉపయేమే అని ఆత్మనేపదప్రయోగములే ప్రసిద్ధములు.

'ఇషు గమియమాం ఛః' (ఇతి) అను సూత్రముచే సార్వధాతుకము పరమగునపుడు యమ్ ధాతువునకు యచ్ఛాదేశము నిత్యమగుటచే ఉపయమతే అను యచ్ఛాదేశమురాని రూపమునుచూపుట యుక్తము కాదు.

**20.** చెఱగు మాసినది (పే. 235) అవిరాత్రేయీ.

ఇట అవిః, ఆత్రేయీ అను రెండు పర్యాయ పదములను విడిగా చూపవలెను. 'అవిరాత్రేయీ'అని ఒకేపదముగ చూపుట తప్పు. (చూ. ఆప్టే నిఘంటువు. అవిః—(F) 2. A woman in her course. పేజి. 63; ఆత్రేయీ — A woman in her course. పేజి. 79.)

**22.** చెఱి (పే. 235) (అవ్యయము) పరస్పరమ్—అన్యోన్యమ్.

చెఱిఅను పదమునకు ఒక్కొక్కనికని యర్థము. (చూ. శ. ర. చెఱి—అవ్య. ఒక్కొక్కనికి—చెఱి వేయి ధేనువుల నిచ్చె). ఈ యర్థమును పరస్పరం, అన్యోన్యస్మై అను పదములు బోధించవు. ఈ పదముల కొకరికొకరనియేకాని ఒక్కొక్కనికను నర్థము లేదు. (చూ. ఆప్టే నిఘంటువు. పరస్పర — a. mutual, each other, one another. పే. 317; అన్యోన్య — ind.—one another, each other, mutual.)

కనుక ఏకైకం లేక ప్రత్యేకం అను పదములను చెఱి అను పదమునకు సమానార్థక పదములుగా చూపవలెను. వీనికి చెఱి అను నర్థము ప్రసిద్ధము. (చూ. ఆప్టే నిఘంటువు—ఏకైకం, ఏకైకశః — ind. — one by one, singly, severally. పేజి. 122; ప్రత్యేకం—ind.—one by one, to every one. పే. 355.)

**23.** చేచమురు (పే. 237) వి. త్రప్రః.

త్రప్రః అను పుంలింగరూపమును కాక త్రప్రమ్ అను నపుంసకలింగ రూపము నీయవలెను. పుంలింగరూపమునకు పురోడాశమని యర్థము.

**24.** డంచు (పే. 257) పూ. (1 గ. పవతి— 4 గ. పూయతే—9 గ. పునాతి, పునీతే.

పూఙ్ ధాతువు ఙిత్తగుటచే 'అనుదాత్త ఙిత ఆత్మనేపదమ్' అనుసూత్రముచే ఆత్మనేపదియగుటచే 'పవతి' అనికాక 'పవతే' అనురూపమును చూపవలెను.

పూయతే అనునది 4 వ గణము (దివాది గణము)లోనిదిగ చూపఁబడినది. 4 వ గణములో నీ ధాతువులేదు.

**25.** తగులు (పే. 263) అభిలాషా.

అభిలాష శబ్దము పుంలింగమగుటచే 'అభిలాషః' అని చూపుట యుక్తము. 'కామోఽభిలాష స్తర్షశ్చ' (అమరము). 'అతోఖిఽలాషే ప్రథమం తథావిధే (రఘువంశము)', నఖలు సత్యమేవ శకుంతలాయాం మమాభిలాషః (శాకుంతలము) ఇత్యాది ప్రయోగములలో పుంలింగరూపములే కన్పడుచున్నవి.

**26.** తెఱకొను (పే. 283) ప్రస్థా (1 గ. తిష్ఠతి స్థాతుం, స్థిత.)

ప్రపూర్వక స్థా ధాతువు ఆత్మనేపది యగుటచే ప్రతిష్ఠతే అను రూపము చూపవలెను. సమవప్రవిభ్యాంస్థః (1—3—22) అను సూత్రముచే ప్రపూర్వక స్థా ధాతువుపై ఆత్మనేపదము విధింపబడినది.

**27.** తెల్లవాఱగ (పే. 285) వి. ప్రభాతః.

ప్రభాతశబ్దము నపుంసకలింగముననే ప్రసిద్ధము. కనుక 'ప్రభాతం'అని చూపుట యుక్తము. (చూ. నా. లి. అ. వ్యుష్టం విభాతం ద్వేక్లీబే పుంసి గోసర్గ ఇష్యతే, ప్రభాతం చ.)

**28.** సతము (పే. 518) విణ. శాశ్వతః — తా—తం.

ఇట శాశ్వతశబ్దమును స్త్రీలింగమున 'శాశ్వతా' అని చూపుట యుక్తముకాదు. 'శాశ్వతీ' అనునది సాధురూపము. 'మానిషాద ప్రతిష్ఠాంత్వమగమః శాశ్వతీః సమాః' అను రామాయణ శ్లోకములో 'శాశ్వతీః' అనియే ప్రయోగము.

**29.** వండు (పే. 482) పచతి—పచితుం-పక్వ

పచ్ధాతు వుభయపది యగుటచే పచతే అను నాత్మనేపదరూపమునుగూడ చూపుట యుక్తము.

తుమున్నంత రూపము పచితుం అనికాదు. అనిడ్ధాతువగుటచే 'పక్తుం'అనియే సాధురూపము.

**30.** నసి (పే. 523) విశ. సుందరః, రా, రీ, రం

సుందరశబ్దము గౌరాదిగణమం దుండుటచే 'షిద్గౌరాదిభ్యశ్చ'అను సూత్రముచే సుందరశబ్దముపై స్త్రీత్వార్థమున జీప్ ప్రత్యయమువచ్చి 'సుందరీ'అని యగును. సుందరా అనికాదు. 'ఏకాభార్యా సుందరీవా దరీవా', 'విద్యాధర సుందరీణామ్' అను ప్రయోగముల వలనను, 'సుందరీ రమణీ రామా' అను నామలింగానుశాసనము వలనను సుందరీ అను రూపమే సాధువు. ఆప్టే నిఘంటువునందును సుందరీ అను రూపమే చూపఁబడినది. (చూ. ఆప్టే నిఘంటువు. సుందర—a. (రీ. F.) (పేజి. 608)

**31.** కలగుండుపెట్టు. (పే. 139) మంథ్. (9 గ. మథ్నాతి—మంథి—తుం-త.)

ఇట క్తప్రత్యయరూపముగా మంథిత అని చూపుట యుక్తముకాదు. 'అనిదితాం హల ఉపధాయాః క్ఙితి' అను సూత్రమున లోపమురాగా 'మథిత' అనియే యగును. 'వన్యద్విపేనోన్మథితంత్వగస్య' అని కాళిదాస ప్రయోగము.

**32.** కుత్తుకబంటి (పే. 160) విశ. కంఠదఘ్నః—ఘ్నా.

ఇట స్త్రీలింగమున 'కంఠదఘ్నా'అని టాబంత రూపమసాధువు. 'టిడ్ఢాణఞ్ ద్వయసచ్ దఘ్నచ్' ఇత్యాది సూత్రముచే జీప్ ప్రత్యయమురాగా 'కంఠదఘ్నీ' అనియే యగును.

**33.** మనము (పే. 419) సర్వ. వయమ్. (త్వం అహం చ)

ఇట 'వయమ్'అను పదమునకు 'త్వం అహం చ' అను విగ్రహవాక్యము సరికాదు. ఈ విగ్రహమునకు 'ఆవామ్' అనియే సమానార్థకము.

**34.** పెంపు (పే. 365) 5. మహత్త్వం-త్తా.

ఇట 'మహత్త్వం'అను పదమును తప్పొప్పుల పట్టికలో చూపినచో దాని సాధురూపము విద్యార్థులకు స్పష్టముగా తెలిసెడిది. లేనిచో సాధారణముగా వాడుకలోనున్న 'మహత్యం'అను నసాధురూపమును సాధురూపమని భావించుట కవకాశమున్నది.

**35.** హో (పే. 538) భోః (అవ్య) భగో (అవ్య) అఘో (అవ్య)

భోస్, భగోస్, అఘోస్ అను మూడును సకారాంత నిపాతములగుటచే భగో, అఘో అనికాక భగోస్, అఘోస్ అనురూపములను చూపుట యుక్తము. (చూ. సి. కౌ. భోస్, భగోస్, అఘోస్ ఇతి సాంతా నిపాతాః—స్వాదిసంధి ప్రకరణము)



# భారత్ - రష్యా సంధి

శ్రీ "ఛత్రపతి"

భారతదేశమూ సోవియట్ యూనియన్‌లు ఆగస్టు 9వ తేదీన శాంతి, సహకారం, స్నేహం ఒప్పందంపై సంతకాలు చేశాయి. ఇది—ఈ సంఘటన ప్రపంచాన్ని చాల ఆశ్చర్య చకితం చేసింది. ఎంత ఆశ్చర్య చకితంచేసింది అంటే అమెరికా అధ్యక్షుని ప్రత్యేకదూత డా॥ కిసింగర్ ఆసియా యాత్రపెట్టుకొని భారతదేశంవిూదుగా పాకిస్తాన్‌కు వెళ్ళి, అక్కడి నుండి రహస్యంగా చైనాకు యాత్రచేసి అమెరికా అధ్యకునికీ చైనానాయకులకూ మధ్య సమావేశం జరిగే ఏర్పాటుచేసిన కృషివల్ల కల్గినంతటి ఆశ్చర్యం కలిగింది. భారతదేశంలో ఈ సంధి బహురకాలైన అభిప్రాయాలకూ, వ్యాఖ్యానాలకూ, సంతోషాలకూ విమర్శలకూ కారణమైంది. కొందరు ఈ సంధివల్ల భారతదేశానికి పెద్ద అండ దొరికిందనీ, భారతదేశం ఏ సందర్భంలోనూ ఏకాకికాదని నిరూపణ అయిందనీ అంటున్నారు. బంగ్లాదేశ్‌సమస్య కారణంగా భారత్ పాకిస్తాన్‌ల మధ్య సంభవించిన నూతన ఉద్రేకాలలో పాకిస్తాన్ అధ్యకుడు జనరల్ యాహ్యాఖాన్ అతి ఉద్రేకపు హెచ్చరికలకు ఈ సంధి విరుగుడుగా పని చేయగలదు అని కొందరు అంటున్నారు. శ్రీ రాజగోపాలాచారివంటి అనుభవజ్ఞులైన రాజకీయవేత్తలు ఈ ఒప్పందం చాల ప్రశస్తమైనదనీ, ఇతరదేశాలతో కూడ యిటువంటి ఒప్పందాలు వ్రాసుకోవటానికి ప్రయత్నం చేయాలనీ సూచిస్తున్నారు. దేశంలో ఈ ఒప్పందాన్ని సామాన్య ప్రజానీకం హర్షిస్తున్నదన్న విషయాన్ని ఎవరూకాదనలేరు. పాకిస్తాన్ ఔద్ధత్యానికి ఈ ఒప్పందం సరియైన సమాధానమని వీరు భావిస్తున్నారంటే అందులో ఆశ్చర్యం ఏమీ లేదు. పాకిస్తాన్ ఏ కారణంచేతనైతేనేమి, అనేక దేశాల మద్దతును సంపాదించుకొని అనేక దేశాల సహాయాన్ని పొందగలుగుతున్నది. ప్రపంచంలో అన్ని వర్ధమానదేశాలూ ఇటువంటి సహాయాలను పొందుతూనే ఉన్నాయికాని పాకిస్తాన్ పొందే సహాయంలో మిలిటరీ సహాయం పాలు అధికంగా ఉంటున్నది. ఈ సహాయాన్ని భారతదేశం మీద వినియోగించటంవినా యింకో లక్ష్యం పాకిస్తాన్‌కు లేదన్నది ఈ ఉభయదేశాల చరిత్రలోనూ ఋజువైపోయి ఉంది.

ఈ పరిస్థితిలో బంగ్లాదేశ్ సమస్య వచ్చింది. తన ప్రజలు అని చెప్పుకుంటున్న వారిమీదనే, తన మతస్థులు అయినవారిమీదనే పాకిస్తాన్ అధ్యకుడు సైన్యాలను నడిపాడు. పాకిస్తాన్ సైన్యం సాగించిన జనహత్య ఫలితంగా నెత్తురు ఏరులు ప్రవహించాయి. తూర్పు బెంగాల్‌నుండి అనంతంగా జనులు భారతదేశంలో శరణార్థులుగా ప్రవేశించటం మొదలు పెట్టారు. శరణార్థుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతున్నదేకాని తరగటం లేదు. భారతదేశం అభివృద్ధి సమస్యలకూ, కార్యక్రమాలకూ ఈ కొత్త సమస్య ఒక తీవ్ర ఆఘాతంగా పరిణమించింది. పాకిస్తాన్ అధ్యకుడు తనదేశంలో ఏర్పడిన సమస్యను తాను పరిష్కారం చేసుకోలేక ఆ సమస్యను భారత్ పాకిస్తాన్ సమస్యగా నిరూపించటానికి పడుతున్న యాతనలను ప్రపంచం విస్తుపోయి చూస్తున్నది. తరచు భారతదేశంమీద యుద్ధానికి దిగుతానంటూ హెచ్చరికలుచేస్తూ వుండటాన్ని వింటున్నది. భారత్, పాకిస్తాన్‌లమధ్య యుద్ధమేవస్తే అందులో చైనా కల్పించుకుంటే, తాను తటస్థంగా వుండిపోగలనని అమెరికా భారతదేశాన్ని హెచ్చరించిందనిగూడా అంటున్నారు.

ఈ పరిస్థితిలో ఈ ఒప్పందం కుదరడం, ఈ ఏర్పడిన సమస్య—ఈ బంగ్లాసమస్య—భారత్ పాకి

స్తాన్‌సమస్యకాదనీ, అది పాకిస్తాన్‌సమస్య అనీ, తూర్పు పాకిస్తాన్ ప్రజలతో, ప్రజాప్రతినిధులతో రాజకీయ మైన పరిష్కారాన్ని సాధించుకొనటం ద్వారానే అది పరిష్కారం అవుతుందికాని మిలిటరీ పద్ధతులవల్ల పరిష్కారంకాదని ఆ ఒప్పందం ద్వారానూ, ఆ ఒప్పందం అనంతరం వెలువడిన సంయుక్త ప్రకటన లోనూ విశదం చేయబడటం, భారత ప్రజలకు సంతోషాన్ని కలిగించే కారణం అయింది.

అయితే ఈ ఒప్పందం కుదుర్చుకోవటాన్ని గురించి రెండు సంవత్సరాలనుండీ మంతనాలు జరుగుతున్నాయని భారత విదేశాంగమంత్రి సర్దార్ స్వర్ణసింగ్ ప్రకటించటంతో ఈ సంధిని గురించి ఈ విధంగానేకాక యింకా యితరమైన దృక్కోణాల నుండికూడ ఆలోచించవలసిన అవసరం ఏర్పడుతున్నది. సంధి సంప్రతింపులు రెండేళ్ళ క్రితమే ప్రారంభం అయివుంటే అప్పుడు ఇప్పుడువున్న పరిస్థితులులేవు. అందువల్ల అప్పటి పరిస్థితులు ఏమో ఇప్పుడు ఒకసారి సింహావలోకనం చేసుకోవలసివుంటుంది. అప్పుడు ఈ బాంగ్లాసమస్య లేదు. నిక్సన్, యాహ్యాఖాన్, మావోసయోధ్యఅన్న ప్రశ్నకూడాలేదు. అప్పుడు అమెరికా వియత్నాంనుంచి తన బలాలను ఉపసంహరిస్తానంటున్నది. ఆగ్నేయ ఆసియాలో తనకువున్న స్థావరాలను వదిలివేసిపోతానని బ్రిటన్ చెపుతావుంది. ఈ ఉభయదేశాలూ ఆసియాలో ఈ భాగంనుంచి ఈ విధంగా తొలగిపోయినట్లయితే అప్పుడు అక్కడ బలాబలపరిస్థితులలో మార్పులువచ్చి, ఒకవిధమైన అధికారప్రాబల్య అభావస్థితి ఒకటి ఏర్పడే పద్ధతి కనిపిస్తూవచ్చింది. ఆ రోజుల్లోనే రష్యా, ఆసియా భద్రతకోసంఅని ఒక పథకాన్ని ప్రచారంలోకి తెచ్చింది. ఆసియారాజ్యాలేవీ ఈ పథకాన్ని అంతగా పట్టించుకోలేదు. చైనాయేమో ఆ పథకం తనమీదకు రష్యావేస్తున్న ఆయుధంలాగా భావిస్తూవచ్చింది. అప్పటి పరిస్థితులు అవి. అప్పటినుంచీ ఇప్పటిదాకా ఈ సంధి విషయం మంతనాలు జరుగుతూ వచ్చినట్లయితే ఇందులో తత్కాలసంబంధమైన విషయాలేకాక ఇంకా ఎన్నో యితరమైన గభీర విషయాలు ఇమిడివున్నాయని పరిశీలకులు భావించటంలో ఆశ్చర్యంలేదు.

ఆసియాలో ప్రాబల్యంకోసం సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నాయకుడు శ్రీ బ్రెజ్నెవ్ ఇంకో బృహత్పథకాన్ని ఆ రోజుల్లో రూపొందించినట్లు గూడా చెప్పుకొనడం వుంది. రష్యా, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, భారతదేశాలమధ్య స్నేహ, సహకారాలను తమ ఆధ్వర్యాన పెంపొందించటంద్వారా అటుచైనా ప్రాబల్యాన్నీ, ఇటుపాశ్చాత్యుల ప్రాబల్యాన్నీకూడా ఆసియాలో తుడిచిపెట్టవచ్చునని రష్యనులు ఆలోచించి నట్లు కన్పిస్తుంది. అందువల్లనే ఇటు భారతదేశంతో స్నేహంగా ఉంటూ, సహాయ సహకారాలు అందచేస్తూ, వేరొక దిక్కున పాకిస్తాన్‌కుకూడా సైనిక సహాయం అందచేయటానికి రష్యనులు పూనుకున్నారు. భారతదేశంనుండితప్ప మరెవరినుండీ తనకు ప్రమాదంలేదని పాకిస్తానే చెబుతున్నప్పుడు రష్యా మనకు ఆయుధాలు యిచ్చి పాకిస్తాన్‌కూ ఆయుధాలు యివ్వటంలో అర్థమేమిటి? పాకిస్తాన్‌ని తృప్తిపరచి తనవైపునకు తిప్పుకోవాలన్న తాపత్రయము, లేదా, అమెరికా, చైనా ప్రాబల్యాన్ని తటస్థం చెయ్యాలన్న ఆలోచనతప్ప అందులో మరి ఇంకో ప్రయోజనం కన్పించదు. అయితే ఆ అనంతర సంఘటనలు ఈ వ్యవహారంలో రష్యా ప్రయోగించిన ఉపాయాలు సరిగా పనిచేయలేదని, అవి వృధా అయిపోయినాయని నిరూపణచేస్తున్నాయి. రష్యాదగ్గర ఆయుధాలు పుచ్చుకుంటూనే రష్యా ప్రాబల్యాన్ని పాకిస్తాన్ తనమీద ప్రసరించనీయలేదు. చైనాకు మరింత సన్నిహితంకావటం మొదలుపెట్టింది. అమెరికా చైనాలు సన్నిహితం కావడానికి కూడా పాకిస్తాన్ కారణమయింది. రష్యా—భారతదేశాలమధ్య స్నేహసహకార ఒప్పందాన్ని ఇటుకమీద ఇటుకగా కట్టామని సోవియట్ విదేశాంగమంత్రి శ్రీ గ్రోమికో అయితే అన్నారుగాని, నిజానికి అమెరికా చైనాల మధ్య మైత్రిని సాధించటానికి అయిన కృషిని పాకిస్తాన్ వంటి కొన్నిదేశాలు అడుగుమీద అడుగుగా నిర్మించుకుంటూవచ్చినట్లు కనిపిస్తుంది.

ఈ పరిస్థితులకుతోడు, మధ్యప్రాచ్యంలోకూడా రష్యా ప్రాబల్యానికి కొంత విఘాతం సంభవించినట్లు ఈజిప్టులో జరిగిన సంఘటనలేమి, సూడాన్‌లో ఇటీవల నడిచిన చరిత్ర ఏమి విశదంగా ప్రదర్శి

స్తున్నాయి. ఈ విధంగా ఈ చెప్పబడుతున్న రెండు సంవత్సరాలూ ఈమధ్యపరిస్థితులు ఇట్లా వున్నాయి. అచ్చట భారతదేశము, రష్యాలమధ్య కొనసాగుతూ వస్తున్న సత్సంబంధాలకు అంతరాయం అంటూ ఏర్పడటంకాని, లేక భారతదేశానికి ఇప్పుడు తట స్థించి వున్నటువంటి విపరీత పరిస్థితులయొక్క సవాళ్లు ఎదురు కావడం అన్నటువంటిదికాని ఏమీ లేదు. కాబట్టి కొందరు పరిశీలకులు ఈ సంధి యొక్క ఔచిత్యాన్ని గురించి, వ్యాప్తిని గురించి, అర్థాన్ని గురించి లోతుగా పరిశీలించవలసిన అవసరం వున్నదని అంటున్నారు — పరిశీలనలుచేస్తున్నారు. ఇటువంటి ముఖ్యమైన ఒప్పందాలవంటివి కుదుర్చు కున్నప్పుడు, ఇట్టిపరిశీలనలు జరగడము, వానినిగ్గు తేల్చడము మొదలైనవన్నీ జరగవలసే వుంటాయి. అది సహజం. ఎందుచేతనంటే భారతదేశానికి ఎవరి వల్లనైనా దండయాత్ర భయం వున్నప్పుడు, ఆ భారత దేశానికి అండగా వుండాలని రష్యాగాని, మరియే యితరదేశంగాని అనుకున్నప్పుడు, భారతదేశంమీద దాడి జరిగితే, ఆ దాడి మామీద జరిగినట్లేనని విశదంగా ప్రకటించవచ్చు. అప్పుడు ఇటువంటి ఒప్పందాలతో నిమిత్తమే వుండదు. ఇప్పుడు ఈ ఒప్పందంలోగూడా ఇటువంటి విషయం వుంది. దీనితోపాటు ఇంకా అనేకమైన అంశాలు వున్నాయి. ఆ అంశాలవలన—ఈ ఒప్పందం భారతదేశం స్వేచ్ఛను కొంతవరకు అరికడుతున్నదని వాదించ డానికి అచ్చట అవకాశం వుంది. అమెరికాలో వ్యాఖ్యాతలు ఈ ఒప్పందాన్ని గురించి సరిగ్గా ఇట్లాగే వ్యాఖ్యానించారు. ఈ రకమైన వ్యాఖ్యకు అచ్చట అవకాశం వున్నప్పుడు, మన ఇష్టాలు, మనం వ్యవహరించగల పద్ధతులు సంకుచితం అవుతాయి. ఉదాహరణకు — పాకిస్తాన్ తాను బెదిరిస్తున్నట్లు, నిజంగా మనమీద దాడిచేసింది అనుకుందాము. అప్పుడు రష్యా మనకు, ఈ ఒప్పందం ప్రకారం తోడుగా రావలసి వుంటుంది, వస్తుంది. అయితే అచ్చట మనం అవలంబించగల చర్యలలో స్వేచ్ఛమాత్రం కరువుఅవు తుంది. ఎందుకనగా, అటువంటి చర్యల విషయము పరస్పరము ఆలోచించుకోవాలని ఆ ఒప్పందం చెబు తున్నది.

ఈ రకమైన వాదం సరియైనది కాక పోవచ్చు. కాని ఆ అర్థం అచ్చట కల్గడానికి అవకాశం వుంది. అందుకే కొందరు— ఈ సంధివల్ల ప్రయోజనం ఏమిటి? ఇది ఇప్పుడు భారత ఉపఖండంలో చెల రేగుతున్న ఉద్రేకాలను ఎంతవరకు పరిష్కారం చేయ గల్గుతుంది? అట్లా పరిష్కారం చేసేపక్షంలో మనకు అతితీవ్రమైనదిగా రూపొందిన బాంగ్లాదేశ్ సమస్యకు శరణార్థుల సమస్యకు పరిష్కారం సాధించడంలో ఏ విధంగా తోడ్పడుతుంది? ఈ సంధి దీర్ఘకాలపు సంధి. ఇచ్చట దాని సందర్భ శుద్ధి ఎటువంటిది?— ఈ రకమైన ప్రశ్నలు వేస్తున్నారు. వీని సరియైన సమాధానాలు ఇంతవరకు లభించలేదు. ఏ ఒప్పందం ఎవరు చేసుకున్నా, దానికి రెండు ప్రయోజనాలు వుండాలి. తత్కాలంలో ఆ ఒప్పందం కుదుర్చు కున్న వారు ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారా లను అది సముపార్జించి పెట్టగల్గాలి. ఇది ఒకటి. రెండవది దీర్ఘకాలంమీద ఆ ఒప్పందం ఏ లక్ష్యాలను దృష్టిలో పెట్టుకుని చేసుకొనబడినదో, అందుకు అనువైన పరిస్థితులను ఇప్పటినుంచే కల్పించు కుంటూ పోవడం—అనగా తత్కాల సమస్యల పరి ష్కారంద్వారా, అనంతర కాలసుస్థితికి ఒప్పందం ఉపాదేయం కావలసి వుంటుంది. అందుకే పైన పేర్కొనిన ప్రశ్నలకు ఇందులో సమాధానం కన్పించ వలసి వుంటుంది.

భారత్ రష్యా ఒప్పందంలో ఈ రెండు దేశా లలో ఏదేశం పైన అయినా, ఇంకో దేశం దురాక్రమ ణకు పూనుకుంటే, ఉభయదేశాలూ సంప్రదించు కొని, ఆ దురాక్రమణను తొలగించటానికి తగుచర్యలు అవలంబించా లన్నది ముఖ్యమైన అంశంగా వుంది. అయితే ఆ దురాక్రమణయొక్క లక్షణం అచ్చట విశ దంగా లేదు. అసలు దురాక్రమణ అన్నదానికే ఇంత వరకు ఒక నిర్ధారణ అయిన అర్థం కుదర్చబడలేదు. ఇటు ఇక్కడచూస్తే భారతదేశంపై పాకిస్తాన్ ఒక విచిత్రమైన యుద్ధాన్ని కొనసాగిస్తున్నదని, ఆ పరి స్థితిని పరిశీలించిన ఎవరికైనా అర్థం అవుతుంది. పాకిస్తాన్ సైన్యం తూర్పుబెంగాల్‌లో సాగిస్తున్న అకాండతాండవము కారణంగా శరణార్థులు అనంతంగా భారతదేశంలో ప్రవేశిస్తున్నారు. జనరల్ యాహ్యాఖాన్ తన సైన్యాలతో అయితే భారతదేశంమీద దురా

క్రమణకు దిగలేదు గాని, . ఈ శరణార్థులతో ఒక విచిత్ర దురాక్రమణను ప్రారంభంచేశారు. ఈ శరణార్థుల వ్యవహారం భారత ఆర్థిక రంగంపై సాగుతున్న దురాక్రమణగా భాసిస్తున్నది. శిఖండిని అడ్డం పెట్టుకొని భీష్మునిపై తలపడిన విధంగా ఈ శరణార్థులను అడ్డంపెట్టుకొని భారతదేశంపై దురాక్రమణకాని ఈ దురాక్రమణ కొనసాగించ బడుతున్నది. ఈ రకమైన దురాక్రమణకు ఈ ఒప్పందం పరిష్కారాన్ని చూపిస్తుందా? భారత్—రష్యా ఒప్పందంలో పేర్కొనబడిన దురాక్రమణ అన్నదాని క్రిందకు ఈ దురాక్రమణ వస్తుందా ? వస్తుంది అంటే ఇప్పుడు అందుకు సంబంధించిన సంప్రతింపులు ఇంత వరకు జరిగాయా ? జరిగితే, అందునిమిత్తం ఆలోచించబడిన చర్యలు ఏమిటి ? ఈ విషయాలు ఏమీ తెలియరావడం లేదు.

ఇది ఆకస్మికంగా (అంటే బంగ్లాదేశ్ నిమిత్తం) జరిగిన సంధికాదనీ, దీనిపై ఉభయ దేశాలమధ్య రెండేళ్ళుగా సంప్రతింపులు సాగుతూనే వచ్చాయనీ విదేశాంగమంత్రి శ్రీ స్వర్ణసింగ్ ఉద్ఘాటించారు. అయితే సంధిపత్రంపై సరియైనకాలంలో సంతకాలు జరుగటంవల్ల దానికి ప్రజామోదం లభించిందని కూడ ఆయన అన్నారు. అంటే రెండేళ్ల నుండీ మంతనాలు సాగుతూనే ఉన్నా ఈ నాడు ఈ సంధిపై సంతకాలు జరుగటానికి కారణం బంగ్లాదేశ్ సమస్యయేనని ఆయన పరోక్షంగా అంగీకరించినట్లే అవుతున్నది. అలాంటప్పుడు వియత్నాం మున్నగు సమస్యలకు భారత్—రష్యాల సంయుక్త ప్రకటనలో స్థానం లభించగా బంగ్లా సమస్యకు చోటు దొరక్క పోవటానికి కారణం ఏమిటి ? బంగ్లా విషయంలో మన వైఖరి జగద్విదితం. ఆ సమస్య ప్రస్తావనకు మనకు అభ్యంతరంలేదు. అయితే అభ్యంతరం ఎవరికి—రష్యాకా ? భారత్ రష్యాసంధి పాకిస్తాన్ విషయంలో భారత్‌ను అదుపులో ఉంచగలదన్న అమెరికనుల అభిప్రాయమే నిజమా ? బంగ్లాదేశ్‌ను గుర్తించే విషయంలో భారత్‌కుగల స్వేచ్ఛ ఈ సంధివల్ల సంకుచితం కాగలదా ? కాదని ప్రధాన మంత్రి శ్రీమతి గాంధీ అన్నారు. అంతేకాదు. ఇది రక్షణ ఒప్పందంకాదని, ఇంతకాలంగా మనం అనుసరిస్తూవచ్చిన నిబంధ విధానానికి యిది విరుద్ధం కాదనీకూడ శ్రీమతి గాంధీ అన్నారు. ఒప్పుకుందాము. కాని బంగ్లాసమస్య ఉధృతంగా ఉన్న సమయంలో సంతకాలు జరిగిన ఈ సంధిపత్రంలో బంగ్లాసమస్య ప్రస్తావనలేదు. ఆ తరువాత వెలువడిన సంయుక్త ప్రకటనలో అయినా బంగ్లాదేశ్, 'తూర్పు పాకిస్తాన్'గా ప్రస్తావించబడిందే కాని బంగ్లాదేశ్‌గాకాదు. ఈ సమస్యకు రాజకీయ పరిష్కారమేగాని మరో విధమైన పరిష్కారంలేదని భారత్ రష్యాలు ఉద్ఘాటించటం వల్ల, యాహ్యాఖాన్ అంగీకరిస్తేనే కాని రాజకీయ పరిష్కారం కుదరదు కాబట్టి అతణ్ణి ఒప్పించగల స్థితిలో అమెరికా, బ్రిటన్‌లు సైతం లేవు కాబట్టి, ఈ ఒప్పందం బంగ్లాసమస్య పరిష్కారానికి ఎంతవరకు దోహదకారి అవుతుంది అన్నదిగూడా విచికిత్సా హేతువు అవుతున్నది. పాకిస్తాన్ అధ్యక్షుడు తనంత తానుగా భారత్‌పై యుద్ధం ప్రకటిస్తే, లేక దురాక్రమణకు పూనుకుంటే రష్యా మనలను ఈ సంధి షరతుల ప్రకారం ఆదుకుంటుంది. ఎలా ఆదుకోవాలన్న విషయాన్ని భారత్ రష్యాలు సంప్రతింపులద్వారా తేల్చుకోవాలి. అసలది దురాక్రమణ అవునో కాదో, యుద్ధం అవునో కాదో కూడ సంప్రతింపులద్వారా తేల్చి నిర్ణయించవలసిన విచిత్రమైన పరిస్థితి ఏర్పడుతున్నది. సంప్రతింపులు పూర్తి అయ్యేవరకూ భారత్ ఏమి చేయాలి. ఆ లోపున భారత్ స్వతంత్రించి చర్య తీసుకుంటే, అది ఏకపక్ష చర్య అవుతుంది కాబట్టి రష్యా తనకు బాధ్యతలేదనే అవకాశం లేకపోలేదు. అదే విధంగా భారతదేశం ఏ విషయంలో అయినా తన నిర్ణయాన్ని ప్రకటించేముందు రష్యాతో సంప్రతించవలసిన పరిస్థితి యిప్పుడు ఏర్పడింది. అంటే ఆ మేరకు భారతదేశపు స్వేచ్ఛ అరికట్ట బడిందన్న మాట.

ఈ సంధి భారత్‌పై రష్యనుల పలుకుబడిని అధికం చేసినందున మిగిలిన దేశాలు బంగ్లాదేశ్ విషయంలో భారత్‌కు తోడ్పడేందుకు అంత ఉత్సా

హంతో ముందుకు రాకపోవచ్చు. శ్రీ నిక్సన్ ప్రభుత్వం పాకిస్థాన్ ప్రభుత్వాన్ని బలపరుస్తున్నా, అమెరికా ప్రజాభిప్రాయం భారత్‌వైపు విపరీతంగా మొగ్గుతున్న సమయంలో ఈ సంధి జరిగింది కాబట్టి, అమెరికా ప్రజాభిప్రాయపు వెల్లువకు అధ్యక్షుడు నిక్సన్ తల వొగ్గవలసిన పరిస్థితి తప్పిపోవచ్చు.

భారత్‌కు కమ్యూనిస్టేతర దేశాలనుండి అందుతున్న సహాయం తగ్గిపోవచ్చు. ఒక విబంధ దేశానికి సహాయపడటంలో ఈ దేశాల ఆసక్తి యిప్పుడు మనం రష్యాతో సంధి చేసుకున్నమీదట తగ్గిపోయే అవకాశం లేకపోలేదు. మనం విబంధ విధానాన్ని విడనాడ లేదంటున్నా పాశ్చాత్యేతర దేశమైన జపాన్‌సైతం ఆ విషయాన్ని శంకిస్తున్నది. మనకు అందే విదేశీ సహాయంలో కమ్యూనిస్టేతర దేశాలనుండి అందే సహాయమే అధికం. ఈ సహాయం తరగటం వల్ల వచ్చే లోటును కమ్యూనిస్టుదేశాలు భర్తీచేయ లేవు.

ఇలాంటి ఒప్పందాలే యితర దేశాలతో సైతం—అమెరికాతోసహా — చేసుకోవచ్చని విదేశాంగమంత్రి ప్రకటించారు కాని అది అసంభవం. ఈ ఒప్పందం లోని ఏ అంశానికీ విరుద్ధమైన ఒప్పందాన్ని ఉభయ దేశాలలో యే దేశమూ మరో దేశంతో బహిరంగంగా గానీ, రహస్యంగాగానీ చేసుకోరాదని సంధి షరతులలో స్పష్టంగా పేర్కొనబడింది. అందువల్ల మనం యే ఒప్పందం ఎవరితో చేసుకోదలచినా ఆ పత్రానికి రష్యా ఆమోద ముద్రను ముందుగా పొందవలసి ఉంటుందన్నమాట. ఈ మేరకు మన స్వేచ్ఛ అరి కట్టబడింది.

శాస్త్ర సాంకేతిక రంగాలలో పరస్పర సహ కారాభివృద్ధి విషయం సంధిపత్రంలో ఉంది. ఈ శాస్త్ర సాంకేతిక విషయాలక్రిందికి అణుశక్తిశాస్త్రం వస్తుందా, అణ్వస్త్ర వ్యాప్తి నిషేధపుటొప్పం దంపై సంతకంచేసిన రష్యా భారత్‌తో కలిసి అణు విజ్ఞానాన్ని పంపణీ చేసుకోవటానికి అంగీకరిస్తుందా అన్న విషయం తెలియదు.

మనం యిలాంటి ఒప్పందం చేసుకోవటం యిదే ప్రథమం కాబట్టి యిన్ని విషయాలు ఆలోచించ వలసి వచ్చింది. ఈ సంధికి ఒప్పుకున్నందుకు సంయుక్త ప్రకటనలో మనం రష్యాకు కృతజ్ఞత వెల్లడించాముకూడ. అయితే ఆ ప్రకటనలో రష్యా యిలాంటి కృతజ్ఞతను మనపట్ల ప్రకటించలేదు. ఇది సమానస్థాయిలో జరిగిన సంధికాదని ఈ ఒక్క సంగతివల్లనే వ్యక్తం అవుతున్నది.

ఇది అతి దీర్ఘకాలానికి సంబంధించిన 20 ఏళ్ళ ఒప్పందం. ఒకవిధంగా మంచిదేకావచ్చు. 20 ఏళ్ళపాటు రష్యా మనకు అండగా నిలువగలదనే భరో సాతో మనం పనిచేసుకోవచ్చు. అయితే 20 ఏళ్ళ పాటు మనం రష్యాతో అతి మెలకువగా వ్యవహరిస్తూ ఎప్పటి కప్పుడు మన అస్తిత్వాన్ని బుజువు చేసు కుంటూ ఉండాలన్న దృష్టితో చూస్తే యిది నిజంగా చాల దీర్ఘమైన కాలం.

ఈ సంధివల్ల రష్యా ఆసియాలో ఒక నమ్మకమైన మిత్రదేశాన్ని సంపాదించుకుంది. అమె రికా—పాకిస్థాన్—చైనా మండలానికి ఉజ్జీగా భారత దేశంతో రష్యా యీ నేస్తం కట్టింది. ఈ విధంగా ఆసియాలో పలుకుబడి పెంపొందించుకోవాలని రెండేళ్లుగా చేస్తున్న ప్రయత్నంలో రష్యా ఇప్పటికి విజయం సాధించింది. రష్యా సైనిక పాటవంతోపోల్చి చూస్తే ఈ సంధి కారణంగా రష్యాకు సైనికంగా ఏర్పడిన బాధ్యత అత్యల్పమే. అంతేకాక సంధిపత్రా లను తనశ్రేయస్సు దృష్ట్యా ఎప్పుడు ఎంతమేరకు వినియోగించుకోవాలో రష్యాకు బాగా తెలుసు. కమ్యూ నిస్టు చైనా అగ్రరాజ్యంగా అభివృద్ధి చెందుతోందన్న అనుమానం ఏర్పడగానే ఆ దేశంతోగల సంధి అట్లా వుండగానే, తాను సహాయం ఇచ్చిన శాస్త్రవేత్తలనంద రినీ క్షణాలమీద ఆ దేశంనుంచి రష్యా ఉపసంహరించి వున్న విషయాన్ని ఏ సందర్భంలోను మరిచిపోకూడదు.

భారత విబంధ విధానాన్ని సంధి పత్రంలో ఆమోదించటం అయితే జరిగింది. గతంలో ఫిన్లాం డుతో చేసుకున్న సంధిలోకూడ రష్యా ఆ దేశపు విబంధ విధానాన్ని ఆమోదించింది. అయితే ఆచరణలో ఏమైంది? ఫిన్లాండుకు అంతర్జాతీయరంగంలో స్వేచ్ఛగా కదలాడగల వీలు ఇరుకున పడిపోయింది. కనీసం తాను కోరిన ఆర్థిక విపణిలోచేరే స్వాతంత్ర్యం

కూడా ఫిన్లెండుకు లేకుండా పోయింది. ఫిన్లెండు లోని ఒక వర్గానికి చెందిన రాజకీయ నాయకులు అధికారంలోకి రాలేని పరిస్థితినికూడా రష్యా కల్పించ గలిగింది. అలాంటిదే వార్సామండలం దేశాల అనుభవంకూడ. ఒండొరుల ఆంతరంగిక వ్యవహారాల్లో జోక్యం కలిగించుకోరాదన్నది వార్సామండలం షరతు లలో ఒకటి. అయితే డూబ్‌చెక్ గతి ఏమైందో ఎరు గనివారు లేరు. ఆ దేశాల విషయంలో రష్యా 'పరిమిత సార్వభౌమత్వం' అనే సిద్ధాంతాన్ని రూపొందించిన విషయంకూడ మనకు తెలుసు. ఈ దేశాల అనుభవం దృష్ట్యా మనం 20 సంవత్సరాలపాటు అప్రమత్తంగా ఉండాలంటే 'అబ్బా' అనిపించక తప్పదు.

ఇట్లా ఆలోచిస్తూ, ఈ ఒప్పందాన్ని వింగడించుకుంటూ, పోతే అసలీ ఒప్పందం మన కోసం జరిగిందా, లేక రష్యనులకోసం, ఆగ్నేయ ఆసి యాలో వారి ప్రాబల్యవిస్తరణకోసం జరిగిందా అన్నంతటి అనుమానం కల్గుతుంది. ఇది సహేతుక మైన అనుమానం కాకపోవచ్చు. కాని రష్యనులకు ఇచ్చట ఆగ్నేయ ఆసియా, దక్షిణ ఆసియాలలో ప్రాబల్య సంపాదనమే ప్రధానమైన విషయం అన్న ఒక ఊహ ఆధారంగా చేసుకొని, ఆ స్థితిని గురించి ఆలోచిస్తే, కొన్ని ప్రశ్నలు మనకు ఎదు రవుతాయి. ఈ విషయంలో చైనా వైఖరి ఎలా వుంటుంది? మిగిలిన ఆసియా దేశాలు ఈ ఒప్పం దాన్ని ఏ దృక్పథంతో చూస్తాయి? ఈ సంధి పత్రంపై సంతకంచేసి మనం అగ్రరాజ్యాలమధ్య వచ్చున్న యుద్ధవాతావరణాన్ని ఆసియా ఖండానికి సంబంధించినంతవరకు ఎక్కువ చేశామా? ఇట్లా గూడా ఈ ఒప్పందంపై పరిశీలన కొనసాగవలసిన అవసరం వుంది. కొన్ని ఆసియా దేశాలు ఈ ఒప్పందం ప్రయోజనాలను గురించి తమ అనుమానా లను శంకలను ఇదివరకే వ్యక్తంచేసి వున్నాయి. భారత్—రష్యా ఒప్పందంపై చైనా ఇంతవరకు అధికారికంగా ఎటువంటి వ్యాఖ్యానమూచేసి వుండ లేదు. కాని చైనా ఆలోచనా సరళిలో మార్పు తప్పదు. ఆ మార్పు ఎటు మొగ్గుతుందో చెప్ప లేము. ఏమైనా హిందూ మహాసముద్రానికి 'విముక్తి' కల్గిస్తామంటూ చైనా ప్రధాని ప్రకటించారు. ఈ ప్రకటన అటు రష్యాకు, ఇటు అమెరికాకుగూడా చైనా చేస్తున్న హెచ్చరికవంటిదని అనుకోవచ్చు. చైనా భవిష్యత్ విధానాన్ని—ఇది సూచిస్తున్నదని అనుకోవచ్చు.

ఏది ఏమైనా భారతదేశపు విదేశాంగ విధానపు ఆలోచనా సరళిలో మార్పు వచ్చిందనటానికి—మనం బహిరంగంగా అంగీకరించినా అంగీకరించక పోయినా— ఈ సంధి ఒక నిదర్శనం. మార్పు అనేది ప్రారంభ మైంది కాబట్టి ఈ మార్పును దేశ శ్రేయస్సుకు అనుగుణంగా తీర్చి దిద్దుకోవలసిన అవసరం వుంది. ఈ సందర్భంగా చారిత్రకంగా స్థిరపడిన కొన్నిముఖ్య విషయాలను మనం మరిచిపోకూడదు. ఎన్ని ధర్మ ప్రసంగాలు చేసినా, యే అగ్రరాజ్యమూ మరోరాజ్యం బలీయం కావటాన్ని, అగ్రరాజ్యంగా రూపొందటాన్ని సహించలేక పోతున్నది. మిగిలిన దేశాలు తమ దయా ధర్మాలపై సదా ఆధారపడాలనేదే ఆ దేశాల ఆకాంక్ష. భారత్‌కు స్వాతంత్ర్యంఇస్తే అగ్రరాజ్యంగా రూపొందు తుందేమో అన్న భయంతోనే బ్రిటన్ ద్విజాతిసిద్ధాం తాన్ని బలపరచి భారత్‌ను రెండుగా విభజించింది. 'హిందీ—చీనీ భాయ్ భాయ్' అంటున్న రోజులో భారత్‌బలం పుంజుకోకుండా చూచేందుకే అమెరికా బ్రిటన్‌లు పాకిస్తాన్‌కు అండగానిలిచి, భారత ఉప ఖండంలో ఉద్రేకాలకు ఉపశాంతిలేకుండా చేశాయి. కాశ్మీర్ సమస్యపై ఈ దేశాలు ఆదిలో పాకిస్తాన్ చెప్పిందే వేదమని అనటానికికూడ యిదే కారణం. చైనా పాకిస్తాన్ పొత్తు కారణంగా చైనావల్ల పాకి స్తాన్‌కు ప్రమాదంలేదని తెలిసినా, కమ్యూనిస్టులను నిరోధించే పేరిట అమెరికా పాకిస్తాన్‌కు సాగించిన సహాయం భారత్‌ను బలపడకుండా చేయటానికేనని అనుకోవచ్చు. ఈ రకం రాజకీయాలలో రష్యాకూడ తక్కువ తిన్నదని అనుకోరాదు. చైనా ఎక్కడ అగ్రరాజ్యమౌతుందోఅనే భయం ఏర్పడగానే ఆ దేశంతో గల కమ్యూనిస్టు సౌభ్రాతృత్వాన్ని సైతం తృణీ కరించింది. ఇందువల్ల మంచియే జరిగిం

దనీ, తామీ రోజున అణ్వాస్త్రరంగంలో యింతగా పురోగమించటానికి కృశ్చేవ్ కారణమనీ చైనా ప్రధాని యిటీవల అన్నారు. అంటే రష్యనుల ఆధిపత్యంలో నిజమైనబలాన్ని సంపాదించుకోలేకపోయామని ఆయన అభిప్రాయపడుతున్నారు. మరి ఇప్పుడు మనం రష్యాతో ఒప్పందం చేసుకున్నాం. ఈ సందర్భంగా, పగవాడైనా, చౌఎన్‌లై అన్నమాటలను మనం గుర్తువుంచుకోవలసేవుంటుంది. రష్యాతో చేసుకున్న సంధి నిలవాలంటే మనంకూడ రష్యాతో సరిసమానమైన స్థాయికి పెరగాలి. అప్పుడు కాని ఆ సంధికి సమస్థితి ఏర్పడదు. అలా పెరుగనిరోజున రష్యా ఏనాడు కావాలనుకుంటే ఆనాడు ఈ సంధిని అలక్ష్యం చేయవచ్చు. అగ్రస్థాయిని అందుకోవటానికి మనంచేసే ప్రయత్నానికి యిటు రష్యాకానీ, అటు అమెరికాగానీ సహకరించవన్న ప్రాతిపదికలో మన ఆలోచనలు సాగవలసిన అవసరం కన్పిస్తున్నది. అందువల్ల మనవంటి స్థితిలోనేఉన్న జపాన్‌వంటి యితర దేశాలతో సహాయ సహకారాలు- పెంపొందించుకుంటూ, తుల్య బలస్థితి సాధనకు కృషిచేయవలసిన అవసరం ఇచ్చట స్పష్టమై కన్పిస్తున్నది. అరబ్‌దేశాల నిమిత్తం మనం ఇజ్రేల్‌ను దూరంచేసుకుంటూవస్తున్నాము. ఆ అరబ్‌దేశాలు అవసరానికి పాకిస్తాన్‌కు మాత్రమే అండగా నిలుస్తాయని యిప్పుడు బుజువైందికాబట్టి మధ్యప్రాచ్యం విషయంలో మన వైఖరిని పునఃసమీక్ష చేసుకోవలసిన అవసరంవుంది.

---



# "యౌవనే విషయైషినాం"

## "ఆంగీరస్"

### 10

గృహస్థాశ్రమ పూర్వకాండ వివాహవిధి. ఈ వివాహవిధికి సంబంధించిన ప్రయోగ విశేషాలను సందర్శిస్తే, విపరీతకాముక ధోరణులను ఆ మంత్ర సంకలన కర్తలు ఏ విధంగా గ్రహించి, ఏవిధంగా వానిని అదుపులో పెట్టడానికి, లేక నియంత్రితం చెయ్యడానికి ప్రయత్నించింది తెలుస్తుంది. కన్యాదానం సందర్భాన్నే తీసుకుని చూడవచ్చు. అచ్చట కన్యాదాత వరుణ్ణిగురించి పల్కవలసిన ప్రయోగం దగ్గర— 'ధర్మేచ— అర్థేచ — కామేచ — నాతి చరితవ్యేతి దాతావదేత్. నాతిచరామీతి వరః ప్రత్యుక్త్వా—' అంటూవుంటుంది.

ఈ వివాహ ప్రయోగ సంబంధమైన మంత్ర భాగాలను పరిశీలిస్తే, స్త్రీ పురుష సంబంధమైన అనేక విషయాలను గురించి ఏ విధమైన ఆలోచనలు జరిగినన్నదీ స్పష్టంగా కన్పిస్తుంది.

కొన్ని మంత్రాలు ఇచ్చట ఉదాహరిస్తాను.

అఘోరచక్షు రపతి ఘ్న్యేధి శివాపతిభ్య స్సుమనా స్సువర్చా జీవసూ ర్దేవకామా స్యోనా శంనోభవ ద్విపదే శం చతుష్పదే.

అపశ్యం త్వా మనసాచేకితానం తపసోజాతం తపసో విభూతం ప్రజా మిహరయిగ్ం ఇహరరాణః ప్రజాయస్వప్రజయాపుత్రకామ.

అపశ్యంత్వామనసాదిధ్యానాగ్ స్యాయాం తనూగ్ం ఋత్వియేనాథమానావ్ం ఉపమా ముచ్చా యుపతి ర్భభూయాః ప్రజాయస్వ ప్రజయా పుత్రకామే.

### 11

కామాన్ని ముఖ్యంగా స్వైరమైన కామాన్ని ప్రేమగా మార్చేందుకు వివాహం అన్నది స్త్రీ పురుషులకు అవసరమైంది. ఈ నిబంధనంలేని సంఘాలు ఒకప్పుడు వుండివుంటాయి. స్త్రీ పురుష సంబంధాలు విశృంఖలంగా వున్న సందర్భాలలో అసుఖమేగాని సుఖంలేదు. 'ఎచ్చట స్త్రీ పురుష సంబంధాలు విశృంఖలమై, నిబంధన రహితమై వుంటాయో అచ్చట స్త్రీలు పురుషులుకూడా వారి సంబంధాలలో తీవ్రమైన అసుఖాన్ని అనుభవించినట్లు కన్పిస్తుంది. ఆ నిబంధన వివాహబంధంగా పరిణామం చెందింది. జనుల శృంగారజీవనం సహజంగా నిబంధితంకాని పక్షంలో జనజీవితం ఉద్రేకజటిలం అయిపోతుంది. క్షీరదాలైన పశుప్రపంచంలో ఒక విధమైన నిబంధనం సహజంగానే ఏర్పడివుంది. వానికి ఋతుధర్మం వుంది. మనుష్యలోకంలో అదిలేదు. మనుష్యులలో స్త్రీలలో నిత్యకామన ప్రకృష్టమైవుంది. ఇందుచేతగూడా మనుష్యలోకంలో స్త్రీ పురుష సంబంధమైన జీవనం క్రమబద్ధము, నిబంధితము కావలసివుంది. ఈ నిబంధనం ఏకభార్యాత్వ, బహుభార్యాత్వ, బహుపతిత్వ సంబంధాలుగా ప్రవృత్తిని పొందింది' అని ఆర్నాల్డ్ టోయన్‌బీ అంటున్నారు. అయితే ఈ విచారణలో మనుష్యుని జీవితాన్ని వయోధర్మ ప్రకృష్టంగా విశ్లేషించడం కన్పించదు. భారత దేశంలో చూచినట్లయితే ఈ విశ్లేషణం ఎప్పుడో, చరిత్రకు ముందుకాలంలోనే ప్రారంభమైనట్లు కన్పిస్తుంది. భారతీయ తాత్వికులలో ప్రథములైన కపిలుని సాంఖ్య పద్ధతిలోనే బ్రహ్మచర్యాన్ని గురించిన ప్రసక్తివుంది. కపిలుని ప్రకృతి పురుష వివేక ప్రతిపాదన అడుగుస—జాగ్రత్తగా పరిశీలిస్తే, స్త్రీ పురుష సంబంధమైన భావప్రాతిపదికంగా గోచరించి తీరుతుంది. ఇచ్చట మనకు ఆ తక్కిన సాంఖ్య

విచారణతో నిమిత్తంలేదు. ఇంకొంచెం వెనక్కుపోయి, వేదాలలో చూచినా, అచ్చట ప్రశస్తమైన మంత్రం ఒకటి గోచరిస్తుంది. "ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో2 భిచాకశీతి". ఈ మంత్రం అర్థంలోగూడా ఏవంవిధమైన అభిజ్ఞానాన్ని దర్శించవచ్చు. పోనుపోను ఈ విజ్ఞానంలోతై, విశాలమై, విశిష్టమై ఆశ్రమధర్మ ప్రపంచంగా రూపుకట్టి వుంటుంది. ఆచ్చట వయస్సును బట్టి ఇది బ్రహ్మచర్య దశ, ఇది గార్హపత్యదశ, ఇది వానప్రస్థ దశ, ఇది సన్యాసఆశ్రమ స్వీకారానికి అనువైన వయస్సు—ఇట్లా మనుష్యుని జీవనదశా విశేషం అంతా వింగడించబడి విశ్లేషించబడింది.

మనుష్యుని ప్రవృత్తి బహు విధాలుగా వుంటుంది. ముఖ్యంగా మానసిక ప్రవృత్తి. ఆ మనస్సుకు ఏమి ఆలోచనలు, దాని చేతలకు ఏమి విద్విలాసాలు వుంటాయో మనుష్యుడికే తెలియదు. అందుచేతనే ఒక్కొక్కప్పుడు మనుష్యుడు ఒక్క ఆలోచనజేసి, ఆ ఆలోచన వచ్చినందుకు తానే ఆశ్చర్యచకితుడై పోతూ వుంటాడు. అసలు ఆ ఆలోచన తాను చేశానా అనుకుంటాడు. ఈ రకమైన స్థితికి శాస్త్రవేత్తలు అనేక రకాలయిన కారణాలు చెబుతారు. మనస్సుకు రెండు గదులు వున్నాయని, ఒకటి వ్యక్తము, రెండవది అవ్యక్తము అయినటువంటివని అంటున్నారు. అనగా Conscious, Sub—Conscious అని అంటున్నారన్నమాట. ఇప్పుడు మనకు మనస్సును గురించి ఏమి తెలిసినా, దానియొక్క ఈ వ్యక్త స్థితిని గురించేగాని, దానియొక్క అవ్యక్త స్థితి తెలియరానిదిగా వుంటున్నదని, మనుష్యుని యొక్క అవ్యక్త మనస్స్థితి ప్రభావం ప్రబలంగూడా అయినదని—అంటున్నారు. అందులో జరిగే పనులు వ్యక్త స్థితిలో మనస్సుకు తెలియవు. అది మనుష్యుని చేతనను ఏలుతూ వుంటుంది. మనుష్యునియొక్క విపరీతపు ఆలోచనలకు, విపరీతపు లక్షణాలు అది స్థానం కావచ్చు. అందుచేతనే మనుష్యుని ఎతలను, [illegible]లేక ప్రవృత్తులను ఒక క్రమంలో పెట్టాలి అంటే, మనస్సుయొక్క ఈ రెండు దశలను అంకెకు తీసుకొని రావలసి వుంటుంది. లేదా ప్రవృత్తులను సభ్యమైన, నాగరికమైన మార్గాలలో ఒదిగించవలసివుంటుంది. మతాలు, ధర్మాలు చేసే పని సగంభాగం ఇదే. ఏ మతం చెప్పినా, మనస్సును కట్టే మాటలనే చెబుతుంది. మనస్సుకు ఏకనిష్ఠమైన, ఏకాగ్రమైన స్థితిని తెచ్చిపెట్టే ధర్మాలనే అనుశాసిస్తుంది. ఆ చెప్పిన దాన్ని బట్టి చూచినా మనస్సుయొక్క ఈ రెండుదశల లక్షణాన్ని ఆ చెప్పినవారు ఇంతో అంతో గ్రహించారనే అంగీకరించవలసి వుంటుంది. విచిత్రం ఏమంటే కొందరు మనస్సును మనస్సుచేతనే కట్టాలంటారు.

> 'మనసు గుర్రమురోరి—మనిషీ
> మనసు కళ్లెములాగు, మనిషీ
> కళ్లెమును వదిలితే కంచెలో పడద్రోయు
> కళ్లు తేలేస్తావు, జనుడా,
> ఆపైన కార్యమేమున్నదిర, జనుడా' [1].

అన్నటువంటి పాటవంటి పాటలోవున్న అర్థాన్ని ఆలోచిస్తే ఈ విషయం కొంత అవగాహన అవుతుంది. మనసే గుర్రం. మనసే కళ్లెం. ఆ గుర్రాన్ని తెలిసి, ఆ కళ్లాన్ని లాగడంలోవుంది. కళ్లెంలాగితే మనిషి క్రిందపడడు. వదిలితే పడతాడు. ఇది మనిషియొక్క విచిత్రమైన అవస్థ. ఈ రకమైన అవస్థలను అనేకం గ్రహించివుండే, చిత్తవృత్తుల లక్షణాలను విశ్లేషించివుండే, స్త్రీ పురుష సంబంధమైన సంబంధ రజ్జువులను బిగించడానికి మన్వాది మనీషులు వివాహ నిబంధనం విషయంలో బహుమార్గాలను ప్రపంచించారు. ఆ వివాహంగురించి బ్రాహ్మ్యగాంధర్వాది బహువిధ పద్ధతులను ప్రపంచించారు. ఆ వివాహ పద్ధతులలో రాక్షసాది వికృత పద్ధతులను గూడా అంగీకరించారు. స్త్రీ పురుషులయొక్క చిత్తవృత్తులయొక్క విపరీత స్థితులనుగూడా చూచివుండి ఆ విపరీత లక్షణాలనుగూడా సంయమన సాధనకు నిబంధన పద్ధతికి ఉపాయ విశేషంగా గ్రహించారు.

ఇటువంటి విషయాలను వింగడించుకుంటూ

---

1. చెలియలికట్ట—శ్రీ విశ్వనాథసత్యనారాయణ.

పోతే అనాదికాలంనుంచి మానవ ధర్మశాస్త్రవేత్తలు, శాస్త్రలు అయినవారు, ఈ మానవ లోకానికి కల్యాణాన్ని సాధించిపెట్టడానికి, సంఘంయొక్క సుస్థితి సాధనకు, ఈ స్త్రీపురుష సంబంధ నిబంధనలు ఎంత ముఖ్యమైనవిగా భావిస్తూ వచ్చింది వ్యక్తం అవుతుంది. ఉపనిషత్తులలో ఒక కథలో ఒక విషయం చెప్పబడివుంది. భగవద్రవ్యము మొట్ట మొదటగా లీలావికారాన్ని పొందినదై, సృష్టిసంకల్ప విశిష్టమైనదైనప్పుడు ఒకరూపాన్ని ధరిస్తుంది. అది ఒక మహాభూతము. ఆ భూతము ఏ ఒక్కరూ లేని ఈ మహావిశ్వంలో ఆవిర్భావం చెందినప్పుడు, అందులో తన ఒంటరితనాన్నిచూచి భయాన్నిపొందింది. తనకు తోడుకావాలి అనుకుంది. అనుకొని, తనకు తోడు కావాలి అని సంకల్పించింది. తనలో అర్ధభాగాన్ని చీల్చివేయగా, ఆ అర్ధభాగము స్త్రీయై నిలిచింది.

ఆయనపతి, ఆమె పత్నిఅయినారు.

ఆత్మైవేద మగ్ర ఆసీత్పురుషవిధః
సోఽనువీక్ష్య
నాన్య దాత్మనోఽపశ్యత్ సోహమస్మీ
త్యగ్రే వ్యాహరత్తతోఽహం నామాభవత్తస్మా
దప్యేతర్హ్యామంత్రితోఽహమయమిత్యే వాగ్ర
ఉక్త్వాఽథాన్యన్నామ ప్రబ్రూతే
యదస్య భవతి
స యత్పూర్వోఽస్మా త్సర్వస్మాత్ సర్వాన్పాప్మన
ఔషత్తస్మా త్పురుష
ఓషతి హ వై స తం
యోఽస్మాత్ పూర్వో
బుభూషతి య ఏవంవేద.

సోఽబిభేత్తస్మా దేకాకీ బిభేతి
సహాయ మీక్షాంచక్రే
యన్మదన్య న్నాస్తి
కస్మాన్ను బిభేమీతి
తత ఏవాస్య భయం వీయాయ
కస్మా ద్ధ్యభేష్య ద్ద్వితీయాద్వై భయం భవతి

స వై నైవ రేమే
తస్మాదేకాకీ న రమతే
సద్వితీయ మైచ్ఛత్
స హై తావానాస యథా స్త్రీపుమాంసౌ
సంపరిష్వక్తౌ స ఇమమేవాఽత్మానం
ద్వేధా పాతయత్తతః
పతిశ్చ పత్నీ చాభవతాం
తస్మాదిదమర్ధబృగలమివ
స్వ ఇతి హ స్మాఽహ యాజ్ఞవల్క్య
స్తస్మా దయమాకాశః స్త్రియా
పూర్యత ఏవ తాగ్ం సమభవ త్తతో
మనుష్యా అజాయన్త.

బృహదారణ్యకంలోని ఈ మంత్రాలలో పై విషయం అంతా చెప్పబడి వుంది. ప్రథమ భూతమైన ప్రజాపతి ఏకాకిగా వుండగా భయం వేసింది. ఏకాకిగావుండగా ఆయన రమించలేకపోయినాడు. స్త్రీ ద్వితీయుడుకాగా రతి అనుభవమైంది. ఇష్టార్థ సంయోగజమైన క్రీడ రతి. ఇష్టవియోగం చేత మనస్సు ఆకులం అవుతున్నది. దానిని అరతి అంటారు. ఇచ్చట ప్రజాపతి అరతి అన్న అసుఖం యొక్క అపనోదార్థం, అరతి అపఘాత సమర్థమైన స్త్రీని కల్పన చేసుకున్నాడు. ఆస్త్రీ తనయందే ప్రభవం చెందింది.

శంకర భగవత్పాదులు ఇచ్చట ఈవిధంగా భాష్యంరచించారు. 'తత స్తస్మాత్ పాతనా త్పతిశ్చ పత్నీ చాభవతామితి దంపత్యోర్నిర్వచనం లౌకికయోరత ఏవ తస్మాద్య స్మాదాత్మనఏవార్ధః పృథగ్భూతో యేయం స్త్రీ తస్మాదిదం శరీరమాత్మనోఽర్ధ బృగలమర్ధంచ తదర్ధ బృగలం విదలమర్ధవిదల మిత్యేర్థః।

ఈ మంత్రాలను పరిశీలిస్తే, అందులో వేదాంతపరమైన అర్థాన్ని అట్లావుంచి, మామూలుగా వున్నదానిని వున్నట్లుగ్రహిస్తే ఆ అర్థం ఈ విధంగా

గూడా చెప్పుకోవచ్చు. పురుషుడు వున్నాడు. వాడు ఏకాకిగా వున్నాడు. ఏకాకిగా వుండగా అతనికి ఒక దశలో భయంలేని స్థితివుంది. తర్వాత తనకు తోడు లేక భయంవేసింది. అది ఇష్టవియోగంవల్ల కల్గినటువంటిది. అరతివల్ల కల్గినటువంటిది. 'అరతి' రన్న మాటకు శంకరభగవత్పాదులవారు 'ఇష్టవియోగాన్మనస్యాకులీభావోఽ రతిరుచ్యతే' అని భాష్యం వ్రాశారు. మరి రతి అంటే ఏమిటి? 'రతిర్నామ ఇష్టార్థ సంయోగజా క్రీడా' అన్నారు. బృహదారణ్యకం చతుర్థ బ్రాహ్మణం నుంచి పైన ఉదహరించిన మంత్రాలలో 'స నైవ రేమే తస్మాత్ ఏకాకీ న రమతే సద్వితీయ మైచ్ఛత్! ... యథా స్త్రీ పుమాంసౌ సంపరిష్వక్తౌ స ఇమమేవాత్మానం ద్వేధాఽ పాతయత్తతః పతిశ్చ పత్నీ చాభవతాం—' మొదలుగాగల వాక్యాలు వున్నాయి. వీని అర్థం స్పష్టంగా తెలుస్తూనేవుంది. ప్రపంచంలో ప్రథమ గ్రంథాలని చెప్పబడుతున్న వేదాలలో — పతి, పత్నీ భావం దాని యొక్క వివరణ ఇట్లావున్నాయి. ఇచ్చట మనిషియొక్క ప్రథమ చిత్తవృత్తి భయంగా చెప్పబడింది. ఆ భయానికి ఈ రతి, లేక రమణము అపనోదనౌషధంగా పేర్కొనబడింది. మనస్తత్వశాస్త్రవేత్తలు ఈ చిత్తవృత్తి వ్యవహారాన్ని పరిశీలనచేయడంలో వేదంనుంచి ఇటువంటివెన్నో విషయాలను గ్రహించవచ్చు. ఇచ్చట పురుషుడు తాను 'ఏదో అభద్రస్థితిలో, ఇష్టార్థ సంయోగంలేనిస్థితిలో పడిపోయినానని, అనుకొని, ఆ అనిష్టార్థ అపనోదనంకోసం, ఇష్టార్థసంయోగం కోసం అర్రులు చాస్తున్నాడు. ఇప్పుడు సమాజం అభద్రస్థితిలోవుండి యువతరంలో సర్వతకాలయిన ఉద్రేకాలు, వికారభావాలు కల్గుతున్నాయి అని వర్తమానపరిస్థితులను, వివక్షించి నిగమనంచేస్తున్న వారు, బృహదారణ్యకంలో ఈ భాగంలో చెప్పబడివున్న భావ పరంపరను చూస్తే, ఆశ్చర్యపడ వలసి వుంటుంది.

## 12

ఈ స్త్రీ పురుష సంబంధమైన విచారణ ఇంతటితోఆగడంలేదు. బృహదారణ్యకంలోనే మైత్రేయీ బ్రాహ్మణంలో ఒక మంత్రంవుంది. ఆ మంత్రం పుట్టుకకు చెప్పబడినవిషయాన్నిగూడా ఇక్కడ కొంత చెప్పుకోవలసి వుంటుంది. యాజ్ఞవల్క్యుడన్న ఋషి వున్నాడు. ఆయనకు ఇద్దరు భార్యలు. ఒకతె కాత్యాయిని. రెండవయామెమైత్రేయి. ఆయనకు గార్హస్థ్యస్థాన ఊర్ధ్వమైన ఆశ్రమంలో ప్రవేశించాలని ఇచ్ఛ కల్గుతుంది. భార్యలయొక్క అనుమతి పొందవలసి వున్నది. ఆ అనుమతికోసం అయిన ప్రయత్నంలో ఆయన మైత్రేయిఅన్న తన భార్యవద్దకు వచ్చాడు. విషయం చెప్పాడు. అక్కడ వారిద్దరిమధ్య జరిగిన చర్చే ఈ మైత్రేయీ బ్రాహ్మణంలో వివరించబడింది. ఆ సందర్భంలో స్త్రీ పురుషాదికమైన సంబంధ విషయకమైన చర్చగూడా కొంత జరిగింది. అందులోని ఒక ముఖ్యమంత్రం ఇది :

స హోవాచ న వా అరే
పత్యుః కామాయ పతిః ప్రియోభవతి
ఆత్మనస్తు కామాయపతిః ప్రియోభవతి
న వా అరే జాయాయై కామాయ జాయా
ప్రియా భవతి
ఆత్మనస్తు కామాయ జాయా ప్రియా భవతి
న వా అరే పుత్రాణాం కామాయ పుత్రాః
ప్రియా భవంతి
ఆత్మనస్తు కామాయ పుత్రాః ప్రియా భవంతి
న వా అరే విత్తస్య కామాయ
విత్తం ప్రియం భవతి
ఆత్మనస్తు కామాయ విత్తం ప్రియం భవతి
న వా అరే బ్రహ్మణః కామాయ
బ్రహ్మ ప్రియం భవతి
ఆత్మనస్తు కామాయ బ్రహ్మ ప్రియం భవతి
న వా అరే క్షత్రస్య కామాయ క్షత్రం
ప్రియం భవతి
ఆత్మనస్తు కామాయ క్షత్రం ప్రియం భవతి
న వా అరే లోకానాం కామాయ లోకాః
ప్రియా భవంతి
ఆత్మనస్తు కామాయ లోకాః ప్రియా భవంతి

న వా అరే దేవానాం కామాయ
దేవాః ప్రియా భవంతి
ఆత్మనస్తు కామాయ దేవాః
ప్రియా భవంతి
న వా అరే భూతానాం కామాయ
భూతాని ప్రియాణి భవంతి
ఆత్మనస్తు కామాయ
భూతాని ప్రియాణి భవంతి.
న వా అరే సర్వస్య కామాయ
సర్వం ప్రియం భవతి
ఆత్మనస్తు కామాయ సర్వం
ప్రియం భవతి
ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో
మంతవ్యో నిదిధ్యాసితవ్యో
మైత్రేయ్యాత్మనో వా అరే
దర్శనేన శ్రవణేన మత్యా విజ్ఞానేదగ్ం
సర్వం విదితం.

ఇచ్చట ఈ మంత్రంలో ప్రపంచంలో మనుష్యునకువుండే సర్వ రకాల సంబంధాలను గురించిన విచారణమున్నూ సుష్టుగా జరిగిందనే చెప్పవచ్చు. ఇచ్చట స్త్రీ పురుషుల విషయం తీసుకుందాము. భర్త అనుకుంటాడుగదా తాను తన భార్యను అధికంగా ప్రేమిస్తున్నానని. భార్యగూడా అట్లాగే అనుకుంటున్నది. కాని అది యదార్థంకాదు. ఆ యదార్థం ఇది. ఆ యదార్థంయొక్క అర్థాన్ని భగవత్పాదులవారు భాష్యంలో చెప్పిన రీతిగా చెప్పుకుందాము. 'పత్యుర్భర్తుః కామాయ ప్రయోజనాయ జాయాయాః పతిః ప్రియో న భవతి కింతర్హి ఆత్మనస్తు కామాయ ప్రయోజనాయైవ భార్యాయాః పతిః ప్రియో భవతి.' ఇదే విధంగా తక్కిన వాక్యాలకుగూడా అర్థం చెప్పుకోవలసి వుంటుంది. ఇచ్చట ప్రతిఒక్కడు ఆత్మప్రయోజనంకోసమే ఏ పని చేసినా చేస్తున్నాడు. ఇచ్చట 'కామాయ' అన్న మాటకు భగవత్పాదులవారు 'ప్రయోజనాయ' అని అర్థం చెప్పారు. ఆ ప్రయోజనం తప్ప ఇంకో ఇతరమైన విషయం అచ్చట లేదు. ఇప్పుడు ప్రపంచంలో ఏ ఇతరమైన కార్యాన్ని ఎవరు తలపెట్టినా, అచ్చట ఆత్మప్రయోజనమే ముఖ్యంగాని, తక్కినది కాదు. తక్కినది అధ్యారోపం. ఈ విషయాన్ని గ్రహించని పక్షంలో, వస్తుతత్వంయొక్క అసలు రూపం తెలియదు. కామేచ్ఛావిషయమైన ఉపప్లవం ఒకటి, లేదా ఇంకొకరకమైన ఉద్రేకం ఒకటి, ఒకచోట కల్గినది అంటే, అది ఎంత బాహుళ్యంమీద వున్నప్పటికీ— 'ఆత్మనస్తు కామాయ' అనే వింగడించవలసి వుంటుంది. ఇచ్చట తన్నుతాను ప్రేమించుకుంటూ, తన ప్రయోజనాన్ని, తన ఇష్టార్థపూర్తిని తాను కామించుకుంటూ, తదితరాన్ని ప్రేమం చేస్తున్నట్లు భావిస్తున్నారు. ప్రపంచంలో ఏ రకమైన ఉద్యమాన్నిచూచి, వింగడించినా ఈ అర్థమే గోచరిస్తుంది. 'నవా అరే సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి.'

అందుచేత ఇచ్చట ఈ ప్రపంచంలో ఏ రకమైన ఉపప్లవం వచ్చినా, దానియొక్క స్వరూపాన్ని ఈ విధంగా ఆలోచించవలసిన పరిస్థితిగూడా వుంది అప్పుడు ఆ ఉపప్లవాలను శిక్షించడానికి, ఉద్రేకోపశమనము, ప్రకోపఉపశమనము కల్పించడానికి మార్గాలు కన్పిస్తాయి. భారతదేశంలో ఆశ్రమధర్మ పద్ధతి కన్పించింది. అది ఈ కాలానికి చాలుతుందా అనవచ్చు. కాని మహాకవి అయిన కాళిదాసుని నిగమనం ప్రకారం చూచినట్లయితే, కుదురుతుందనే అనిపిస్తుంది. ఆయన ఆ ధర్మాన్ని త్రికాలాబాధ్యంగా వుండేట్లు, దేశ కాలాద్యనవచ్ఛిన్నంగా వుండేట్లు చెప్పాడు.

శైశవే భ్యస్త విద్యానాం
యౌవనేవిషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం
యోగేనాంతే తనుత్యజాం.

ఇందులో సాధన దుస్సాధమైన దేమీలేదు. పైగా వయస్సునుబట్టి ఆ వయస్సుయొక్క ధర్మా

లనుబట్టి ఆ పద్ధతి అతిరమణీయంగా చెప్పబడి వుంది. మనుష్యుడు ముందు విద్యను అభ్యసించాలి. తర్వాత యౌవనంలో విషయభోగాలు అనుభవించాలి. ఆ వయస్సుమళ్లిన తర్వాత వానప్రస్థం చెయ్యాలి. చివరకు చివరలో యోగంచేత దేహాన్ని వదలాలి. అనగా ముక్తినిపొందాలి. ఈ చెప్పడంలోగూడ విద్యకు, ముక్తికి అనుసంధానం కుదర్చబడింది. అనగా ధర్మార్థ కామ మోక్షాలన్న చతుర్విధపురుషార్థాలున్నూ ఇచ్చట చెప్పబడుతున్నాయి. ఏ కాలంలో, ఏ ధర్మంలో అయినా, మనుష్యునిజీవితం ఇంతకన్నా వేరుగావుండదు. చిన్నప్పుడు చదువు, యౌవనంలో విషయభోగము, వయస్సుమళ్లిన తర్వాత విశ్రాంతి, చివరకు మరణము—ఇదే జీవితం. ఇచ్చట యౌవనంలో విషయభోగం అన్నప్పుడు—అది ఒక నియతిని నిబంధనాన్నికల్గి ఇష్టార్థానుభవ సమర్థకమై, సమస్థితిలో వుండాలి. గీతలలో సమస్థితి యోగంగా పూరికే నిర్వచింపబడలేదు. అది అసమము, విషమము అయిన స్థితిలోపడినప్పుడు ఉపప్లవం వస్తున్నది. శాంతి సాధనను గురించి చెబుతున్నప్పుడు సర్వఉపప్లవరహితమైన స్థితియే ఊహించబడింది.

స్త్రీ పురుష సంబంధమైన శృంగారాదిక విషయాలలోగూడా ఇది అంతే. ఇది యౌవనదశా విశేష విషయం. అచ్చట అతిక్రంచవచ్చు. విపరీత స్థితిగూడా వుండవచ్చు. కాని ప్రతి ఇట్టి విపరీతము వయస్సుచేత దండింపబడుతూ వున్నది. అది సహజంగానే, అచ్చట ప్రకృతిలో అంతర్నిహితమై వున్న ధర్మంలాగా వున్నది. పురుషకారంచేత ఆ ధర్మాన్ని విచక్షించుకొని, విశ్లేషించుకొని, చూడగల్గితే, దాని పరిష్కారం దానిలోనే వున్నదని విశదం అవుతుంది. ఎవరి ఆత్మను వారు శోధించుకుంటూ, ఆ విధంగా సమాజంయొక్క ఆత్మను గ్రహించగల్గితే ఆలోచించగల్గితే, చూడగల్గితే అప్పుడు సర్వము విదితం అవుతుంది.

> 'ఆత్మా వా అరే
> ద్రష్టవ్యః శ్రోతవ్యో
> మంతవ్యో
> నిదిధ్యాసితవ్యో
> మైత్రేయ్యాత్మనో వా అరే
> దర్శనేన శ్రవణేన
> మత్యావిజ్ఞానేదగ్ం
> సర్వం విదితం.'

---



# మనిషిని మలిచే శక్తులు...(?)

శ్రీ ముద్దసాని రాంరెడ్డి

పూరిగుడిసెల్లో పుట్టి చరిత్ర పుటలను సంపన్నం చేసిన మహానుభావులు కొందరు ప్రపంచ దృష్టి నాకట్టుకున్న విషయం సర్వజన విదితమే! సాధారణ కుటుంబంలో జన్మించి, అసాధారణ మేధా సంపత్తితో విరాజిల్లు మట్టిలోనిమాణిక్యాన్ని తిలకించి ప్రపంచం విస్తుపోతూవుంటుంది. వాళ్ళ జన్మలకు ఇదమిద్ధమైన కారణాలు విదితంకాక, సృష్టిమర్మాన్ని ఛేదించడానికి మానసికతత్త్వవేత్తలు, ప్రకృతి పరిశోధకులు నడుముకట్టి రంగంలోదూకి, ఒక నిర్ణయానికి రాలేక తికమక పడుతూవుంటారు. సర్వ సంపద్విలసితమైన కుటుంబంలో మహాపురుషులు జన్మించడం సర్వ సామాన్యంగా చూస్తున్న ప్రపంచానికి, సామాన్యులలో అసామాన్యుల జన్మ సహజంగానే విస్మయాన్ని కలిగిస్తుంది. అందుచేత వాళ్ళ జన్మలకు సహేతుకమగు కారణాలను తెలిసికొనడానికి జిజ్ఞాసువులు పాటుపడుతూవుంటారు.

మేధావుల పుట్టుకకు వారసత్వం కారణమా లేక వారు పుట్టి పెరిగిన పరిస్థితులూ, పరిసర ప్రభావాలు కారణమా? అన్న అంశాన్ని తేల్చి చెప్పడానికి, వైజ్ఞానికులు, మానసిక తాత్త్వికులు, ప్రకృతి పరిశోధకులు గత శతాబ్దంనుండి గవేషణ సాగించి, కుటుంబ వ్యక్తుల పుట్టుపూర్వోత్తరాలను, వారి ఆచారవిచారాలను, వాళ్లు చేపట్టిన వృత్తి మొదలగు విషయాలను కూలంకషంగా పరిశీలించడానికిగాను, ఒక కుటుంబంయొక్క మూలపురుషుడిని తీసుకొని, అతని కుటుంబసభ్యులయొక్క రెండు శతాబ్దాల గత చరిత్రను తడివిచూచి, వారి ఉనికికి ఆచారవ్యవహారాలకు గల కారణాలను క్రోడీకరించి, రెండు పరస్పరవిరుద్ధాలైన సిద్ధాంతాలను ప్రకటించారు. అందొక సిద్ధాంతానుసారం, మనిషి మానసికంగా, ఆధ్యాత్మికంగా, శారీరకంగా అభివృద్ధి చెందడానికిగాని లేదా పతనానికిగాని కారణం అతడు పుట్టి పెరిగిన వంశమేనని ప్రతిపాదిస్తే, మరొకరు వ్యక్తి పుట్టిపెరిగిన పరిసరాలు పరిస్థితులే బలవత్తరములని ఉటంకించారు. ఇంతకూ వంశవారసత్వము, పరిసరాల ప్రభావంయొక్క పూర్వాపరాలను పరిశీలిస్తే పాఠకులకు విషయపరిశీలనలో కొంత ఆసక్తి కలుగుతుంది.

వంశవారసత్వమన్నది కొందరి మతానుసారం ఒకానొక అలౌకికశక్తి, మాహాత్మ్యము. జన్మకు కారకుడైన పురుషుడియొక్క గుణదోషాల ప్రభావశక్తి జన్మించనున్న శిశువు నావరించి తదనుగుణంగా బిడ్డయొక్క మానసిక. బుద్ధివిషయక శక్తులను రూపొందిస్తుంది. తలిదండ్రుల శారీరక, మానసిక, ఆధ్యాత్మిక శక్తులకు ప్రతిబింబంగా శిశువు అవతరిస్తుంది. కొన్ని సందర్భాలలో కన్నవారిపోలిక బిడ్డలకు రాకున్నా, వాళ్ల మతామహ, పితామహుల పోలికలనైనా పుణికి పుచ్చుకుంటారు. ఇంకా కొన్ని సందర్భాలలో ఏడుతరాలు వెనక్కుపోయిన వంశీకుల గుణగణాలను బిడ్డలు రాబట్టుకొనడంకద్దు. ఒకానొకప్పుడు తలిదండ్రులలో సుప్తావస్థలోనున్న దుర్గుణాలు కొన్ని విరాట్స్వరూపంలో బిడ్డల నావరించడంకూడ చూస్తుంటాము. బహుశా అట్టి దుర్గుణాలనుచూచే కాబోలు తమ బిడ్డలను 'నా కడుపున చెడబుట్టినావురా' అని ఏమరక కన్నవారు కసిదీర కసరుకుంటారు. అందుకే మనవాళ్ళు తల్లికి బొల్లి ఉంటె పిల్లకు మచ్చ ఉంటుందని అంటూంటారు. ఒకప్పుడు తలిదండ్రులలోలేని వామనత్వం, వానర రూపం బిడ్డలలో గోచరిస్తే, తద్బీజాంకుర మాహా

త్మ్యము వాళ్ల ఏడుతరాల పితృదేవతల కెవరికో ఉండి ఉండాలని నిర్ధారించవలసి ఉంటుంది. సాధారణంగా సంతానానికి తలిదండ్రుల శారీరక, మానసిక, వైజ్ఞానిక సంపదలో సగభాగం సంక్రమిస్తుంది. మిగతా సగంభాగం వాళ్ల పితృదేవతలు ప్రసాదిస్తారని పరిశోధకుల అభిప్రాయము. ఈ విషయాన్నే మన ఆధ్యాత్మిక వేత్తలు వ్యక్తియొక్క పూర్వజన్మ సుకృత దుష్కృత కర్మఫలంగా చింతిస్తే, భౌతికవాదులు బిడ్డలకు అనువంశికంగా సంక్రమించేటటువంటి సుగుణదుర్గుణ లక్షణాలని చెబుతుంటారు.

ఇకపోతే పరిసరాలు, పరిస్థితుల ప్రభావం పసికందులపై ఎలా ప్రసరిస్తుందన్న విషయాన్ని పరిశీలిద్దాము. ఒక కుటుంబం కాపురంచేస్తున్న పరిసరాలు మరియు పరిస్థితుల ప్రభావం వాళ్ళ సంతానంపై చెరగని ముద్రవేసి వారి భవిష్యత్తును నిర్దేశించడానికి హేతువవుతుందని రెండవవర్గం పరిశోధకుల అభిప్రాయము. ఒకానొక పరిసరం ప్రభావాలకు లోనైన బాలబాలికలు, విద్య నేర్చినా నేర్వకున్నా, కొందరు వ్యక్తుల సహవాసానికి లోనై, కొందరి చేష్టలకు గురియై, కొన్ని అభిప్రాయాలకు లోబడి, కొన్ని అలవాట్లకు బానిసలై, తమ వ్యక్తిత్వాలను రూపొందించుకుంటారు. పరిసరాలు, పరిస్థితులు, వ్యక్తులు, సంఘము, సంఘాచారములు, వీటన్నిటి సమ్మైక్య ప్రభావ ప్రతిరూపమే మానవునియొక్క బుద్ధి వికాస స్వరూపము. బాల బాలికలు తాము పుట్టిన ఇంట్లో, పెరిగిన పరిసరాల్లో, శిక్షణపొందిన విద్యాలయాల్లో, అనుభవించిన పోషణ,చూచిన అనుభూతులు, నేర్చిన విద్యయొక్కముద్రలు ఆజన్మాంతం వారిపై చెరగనిముద్రలై పడి అతని లేక ఆమె భావిజీవనపథాన్ని సుగమము చేస్తాయి. కొన్నిసందర్భాలలో వాళ్ళను ఒక నవలో, నాటకమో, చరిత్ర ఘట్టమో, మతగ్రంథమో, మహానుభావుల జీవితచరిత్రమో, వైజ్ఞానికాంశమో ప్రభావితం చేసి జీవితానికొక మలుపును ప్రసాదించి నూత్నమైన వెలుగును అందిస్తుంది. గాంధిగారు చిన్ననాడు చూచిన హరిశ్చంద్ర, ప్రహ్లాదచరిత్రనాటకాలు; ఆ తర్వాత ఏసు ప్రవక్త పర్వత ప్రబోధములు ఆయన జీవితంపై ముద్రించిన ప్రబోధనం ఇందుకు తార్కాణములు. అబ్రహామ్‌లింకన్ చిన్ననాడు తిలకించిన నీగ్రో బానిసల బ్రతుకుల బాధలే, అతనిచేత వాళ్ల స్వేచ్ఛకొరకు పౌరహక్కులబిల్లును అధ్యక్షుడైనాక ప్రతిపాదింప జేసినవని చెప్పవచ్చు. మొత్తంపై, ఏ మహాత్ముల మహిమ, ఏ పాత్రముల ప్రభావం, ఏ పరిస్థితుల ప్రాబల్యం, బాలబాలికలను ఎలా మలిచి ప్రభావితం చేస్తుందోనన్న విషయాన్ని విశదీకరించి చెప్పడానికి చాలినంత ఆధారం పరిశోధకులకు ఇంకా లభ్యం కాలేదనియే చెప్పవలసివుంది. వ్యక్తి, పరిస్థితుల ప్రభావానికి దాసుడేకాని, పరిస్థితులనే తన వైయక్తిక వికాసాని కనుకూలంగా మలుచుకొనగలిగిన స్తోమత, సామర్థ్యం మానవునికి లేదంటే అత్యుక్తి కాదేమో!

తలిదండ్రుల గుణగణాలు శారీరక వారసత్వరీత్యా బిడ్డలకెలా సంక్రమిస్తాయన్న అంశంపై ప్రప్రథమంగా సర్ ఫ్రాన్సిస్ గాల్టన్ గణాంక రీత్యా పరిశోధించి ఫలితాలను ప్రకటించారు. గాల్టన్ సుమారు 977 ప్రముఖ అమెరికన్ కుటుంబాల చరిత్రలను అవలోడనంచేసి ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. ఆయన పరిశీలించిన కుటుంబాల్లో 970 మంది వ్యక్తులకు వారి మేధాశక్తికిమించిన లేదా సమస్థాయిలోగల వ్యక్తులే బంధువులుగా ఉన్నట్లు కనుగొనబడింది. వారిలోగల 286 మంది న్యాయమూర్తులలో 109 మంది ఉన్నతన్యాయమూర్తులుగా రాణించారట. ఆ కుటుంబాల్లో ఉన్న తక్కువగల వ్యక్తులు కూడా తదితర రంగాల్లో అగ్రగాములుగా రాణించారట. ఈయన పరిశోధన నిగ్గునసరించి, వ్యక్తిత్వము, మేధాసంపత్తి, కార్యదక్షత యనునవి వారసత్వరూపేణా పొందబడు దైవదత్తాంశాలనియే రుజువు చేయబడింది. ప్రముఖ వ్యక్తు లుద్భవించిన కుటుంబాల చరిత్రతోపాటు సర్ గాల్టన్ హీనజన్ముల కుటుంబాల చరిత్రనుకూడ పరిశోధించి, తాను నిర్ధారించిన సిద్ధాంతం సరియైనదేనని నిరూపించాడు. అమెరికాలో దోపిడీలకు, హత్యలకు, వ్యభిచార

మునకు ప్రసిద్ధిగాంచిన జూక్స్ కుటుంబాల చరిత్రను కూడ పరిశోధించాడు. మ్యాక్స్‌జూక్స్ అన్న మూల పురుషునియొక్క ఇద్దరు కొడుకులు అపఖ్యాతి పాలైన కుటుంబంలోని అక్కచెల్లెండ్లనే వివాహం చేసుకున్నారు. వీరి వంశవృక్షంలో పుట్టిపెరిగిన 709 మంది వ్యక్తులను పరిశీలింపగా, వారిలో 108 మంది పూరిగుడిసెల్లో నివసిస్తూ బిక్షాటన వృత్తిపై జీవిస్తూవచ్చినట్లు తేలింది. వాళ్ళ కుటుంబాల్లోనే 140 మంది నేరస్తులుగాను, 60 మంది చౌర్యవృత్తి నవలంబించినవారుగాను, 50 కుటుంబాలవారు వ్యభిచారంపై జీవించినట్లు అంచనా వేయబడింది. పై రెండు పరిశోధనలకు తోడు. డా॥ గొడర్డ్ అన్న ఆయన, మార్టిన్ కాలి కాక్ అను మూలపురుషునికి ఇరువురు భార్యలందు జన్మించిన రెండు వంశవృక్షాల చరిత్రలను పరిశోధించి గాల్టన్ సిద్ధాంతాన్నే మరోవిధంగా సరియైనదని రుజువుచేశాడు. మార్టిన్ కాలికాక్ మొదట బుద్ధిమాంద్యతగల స్త్రీని వివాహం చేసుకున్నాడు. ఆమెవల్ల ఉత్పన్నమైన వంశవృక్షంలో 143 మంది బుద్ధిమాంద్యత కలవారుగాను, 36 మంది అనామక జన్ములుగాను, 33 మంది దుర్జడత కలవారుగాను, ఉన్నట్లు, కేవలం 46మంది వ్యక్తులుమాత్రం సామాన్య జీవితం గడిపిన వ్యక్తులుగాను వున్నట్లు తేలింది. కాలి కాక్ చేసుకున్న రెండవభార్య ఉన్నతవంశసంజాతకాబట్టి ఆమె వంశవృక్షంలోని, 496 మంది వ్యక్తుల్లో ఇద్దరు తక్క తక్కినవారంతా కూడుకు గుడ్డకుకొరతలేనివిధంగా బ్రతుకుతూ, సగౌరవంగా రాణించారని తేలినందు వల్ల వారసత్వపు లక్షణాలు వంశోద్ధారకుల శీలంపై, గుణసంప్రదాయాలపై చెరగని ముద్రవేస్తాయి అని నిగమించడానికి వీలుఏర్పడింది. కాబట్టి మనుష్యుల అదృష్టాల నిర్ణయంపై వారికెలాంటి ప్రమేయంలేదని నిరూపించబడింది. ఈ సిద్ధాంతాను సారం విచారిస్తే, మానవజాతిని సముద్ధరించడానికి విద్య, పోషణ మరియు పరిసరాల ప్రభావం వ్యక్తి వ్యక్తిత్వాన్ని మార్చజాలవని తేలుతుంది. గొడర్డ్ సిద్ధాంతానుసారం, మానవలోకంలో సచ్ఛీలం, సదాచారం, ధీశక్తిని పెంపొందించడానికి, శారీరక, మానసిక, వైజ్ఞానిక మేధాసంపత్తిగల వ్యక్తులద్వారా కొత్తప్రపంచాన్ని సృష్టించవచ్చునని తేలుతోంది. గొడర్డ్ దృష్టిలో విద్య మనిషికి పైపూతగా నిలిచి పోతుందట. పరిస్థితులు, పరిసరాలు వ్యక్తిలో కించిత్తు గూడ పరివర్తనం తీసుకరాజాలవని యీ సైద్ధాంతుకుని వాదము. ఈయన ఒక ఉపమానంద్వారా తన సిద్ధాంతాన్నిలా విపులీకరించాడు. వ్యక్తి పడవగాను, జీవితం సముద్రంగాను, పరిసరాలు, పరిస్థితులు, తుఫాను, కెరటాలు మరియు సముద్రంలోగల పర్వతాలుగాను వర్ణించాడు. తుఫాను మరియు కెరటాలు పడవను సృష్టించజాలవనియూ, అవి కేవలం పడవను తాత్కాలికంగా గమ్యంనుండి సడలించడానికే ప్రయత్నిస్తాయట. పడవయొక్క చోదకుడు ప్రవీణుడైతే పడవను ఎట్టకేలకు గమ్యంవైపు తీసుకొనిపోవడంలో కృతకృత్యుడు కాగలడని అంటాడు డా॥ గొడర్డ్.

గాల్టన్ సిద్ధాంతాన్ని పూర్తిగా పూర్వపక్షం చేయుడానికి కొందరు మానసికతత్త్వవేత్తలు సంకల్పించారు. వారి అభిప్రాయానుసారం—వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని మరియు నడవడిని అతడు పుట్టి పెరిగిన పరిసరాలు, పరిస్థితులే తీర్చిదిద్దుతాయి—అని. ఈ సిద్ధాంతానికి మూలపురుషుడు హెల్విషియస్ అన్న ఫ్రెంచి శాస్త్రకుడు. ఇతని సిద్ధాంతాన్ని అనుసరించి, వ్యక్తిని మానవుడుగా రూపొందించునది విద్య, పోషణ మరియు తర్ఫీదులేక శిక్షణ. ఇవి ప్రధానాలు. 'మానవుడు పుట్టుకలోనే దేవతగానో, దానవుడుగానో జన్మించడు. అతనికిసంక్రమించేటటువంటి మంచిచెడ్డలు అతడు నేర్చినవిద్య ననుసరించి ఉంటాయి. విద్య యనునది సాంఘికాచారములపై ఆధారపడిఉంటుంది; కనుక అది అందరకు సమంగావర్తిస్తుందని హెల్విషియస్ అంటాడు. సామ్యవాద, సహకార సిద్ధాంతముల ప్రతిపాదకులలో ప్రముఖులగు రాబర్ట్ ఓవెన్‌కూడ పై వాదాన్నే సమర్థించారు. వ్యక్తియొక్క అభిప్రాయాలు, మరియు ప్రవర్తన అతడు పుట్టిపెరిగిన పరిసరాలు, పెంచి పెద్దజేసిన తల్లిదండ్రుల నడవడిక ననుసరించియే

రూపొందుతుంటాయని ఓవెన్ అభిప్రాయము. బాలబాలికలకు చిన్ననాటినుండి సక్రమశిక్షణ నిచ్చి, మంచిగృహవసతులు కల్పించి, విద్యాబోధనావకాశాలు సమకూర్చినట్లయితే వాళ్ళు తప్పకుండా సత్పౌరులుగా తయారవుతారని ఓవెన్ సిద్ధాంతీకరించారు. రష్యా అధినేత స్టాలిన్ మరియు ఫ్రాన్స్ నియంత నెపోలియన్‌కూడ రాబర్ట్ ఒవెన్ సిద్ధాంతాన్నే బలపరిచారు. చిన్ననాడే చంటిబిడ్డల మానసిక తత్త్వమును పసిగట్టి, తదనుగుణంగా విద్యాబోధచేసినచో సత్ఫలితాలను సాధించగలమని ప్రసిద్ధ మానసిక శాస్త్రవేత్త వాట్సన్ అభిప్రాయము. మనిషిలో సుషుప్త్యవస్థలోవున్న మేధాశక్తిని, సామర్థ్యాన్ని లేదా తద్వ్యతిరేక స్వభావాలను అభివ్యక్తం చేయించేవి పరిసరాల ప్రభావం, పరిస్థితుల ప్రాబల్యమేననీ, అతని జన్మ వారసత్వ లక్షణా లెంత మాత్రం కాదనీ వీరు గాల్టేనియన్‌సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేశారు. లక్ష్మీ సరస్వతులు తిష్టవేసుకున్న గృహాల్లో పుట్టి పెరిగిన బిడ్డలు సహజంగానే వాటికి వారసులవుతారు. పూరిగుడిసెల్లో పుట్టి, పెంటకుప్పలపై పెరిగిన పేదపిల్లలకు సుశిక్షణ, సదవకాశములు లోపించిన కారణంగా చెడిపోతారని హెల్విషియన్ వాదం. అబ్రహామ్ లింకన్, బెంజామిన్ ఫ్రాంక్లిన్‌వంటి అసాధారణ వ్యక్తులు సామాన్య కుటుంబాల్లోనే జన్మించారు కాబట్టి మేధాసంపత్తి, సంపన్న వంశవారసత్వ లక్షణంకాదని వీరి వాదము. సముచిత విద్యాబోధన, సుశిక్షణ, అశన వసన సదుపాయాలు, సమాజవ్యక్తు లందరకు సమకూరితే విప్లవాత్మకమైన మార్పులు సంభవించి, పౌరులలో ఊహించని రీతిగా ప్రావీణ్యము, మేధాశక్తి, సత్ప్రవర్తన కలుగుటకు అవకాశం ఉంటుందని వీరివాదము. వీరు తమవాదంయొక్క అంశాలను నిరూపించడానికై కవలలుగా జన్మించిన ఇద్దరు బాలికలను తీసుకొని అందొకర్తెను రైతు కుటుంబంలోను మరొకర్తెను సంపన్నకుటుంబంలోను పోషించారు. రైతు కుటుంబంలో పెరిగిన వనిత ధృఢంగా, మొరటుగాఉండి వాతాతపములకు తట్టుకొనగలదిగా తయారై, సంపన్న గృహంలో పెరిగిన వనితకంటె 30 పౌండ్లు అధికంగా తూగింది. ఇకపోతే సంపన్నుల ఇంటపెరిగిన అమ్మాయి తోటకూర కాడవలె సుకుమారిగా రూపొంది నాగరిక లక్షణాలను అలవరచుకున్నది. పరిసరాలు, పరిస్థితుల ప్రభావం వ్యక్తుల శారీరక, మానసిక శక్తులనెలా మార్చగలవన్న విషయం పై ఉదాహరణరీత్యా నిరూపించబడింది. సామాన్య బాలబాలికల నట్లావుంచి, బాలనేరస్తులను సైతం మంచి వాతావరణంలోఉంచి, సక్రమ శిక్షణ ద్వారా సత్పౌరులుగా తీర్చిదిద్ద వచ్చునని హర్బర్ట్, హేవార్డులవంటి మేధావులు నిరూపించారు. పైన వివరించిన సిద్ధాంతాలను ప్రతిపాదించిన సైద్ధాంతికు లిరువురూ ఒక పరమసత్యాన్ని విస్మరించారు. ఒకరు శారీరకవారసత్వాన్నే మనిషి మనుష్యత్వానికి పరమపదసోపానంగా స్వీకరిస్తే, రెండవవారు పరిసరాలు, పరిస్థితుల ప్రభావాలపైననే ప్రాముఖ్యాన్ని ఉంచి చూచారు. కాని యీ రెంటి ప్రభావం తరతమభేదంలో వ్యక్తియొక్క వ్యక్తిత్వాన్ని రూపొందిస్తూవున్నదన్న సత్యాన్ని ఇరువురూ విస్మరించారు. మనిషికి జన్మవారసత్వం, పరిసరాలు తోడునీడల్లాంటివి. కష్టసుఖాల్లాంటివి. పరిసరాల ప్రభావానికి లోనుగాని జన్మవారసత్వం వ్యక్తికుండదు. ఒక దానిని మరుగుపరచి, లేదా ప్రభావరహితంచేసి రెండవది విజృంభించ జాలదు. ఒకే గృహంలో జన్మించిన బిడ్డలిద్దరిలో ఒకడు పరిస్థితుల ప్రభావానికి లోనైతే, రెండవవాడు వ్యక్తుల ప్రభావంతో ప్రభావితుడు కావచ్చు. అందుకే అమ్మకు పుట్టిన ఆరుగురు అందలమెక్కి ఊరేగ జాలరు. పుట్టుకతో సంక్రమించిన నైజగుణాలను సమూలంగా తుడిచిపెట్టుటకు పరిసరాల, పరిస్థితుల పాటవం చాలదు. కాని వ్యక్తులలోగల లోపాలను కొంతవరకైనా, సక్రమ శిక్షణద్వారా కప్పిపుచ్చగలమని సర్ పెర్సీ నన్ ఉద్ఘాటించారు.

వారసత్వం మరియు పరిస్థితులు పరస్పర ఆధారఆధేయాలుగా ఉంటూ వ్యక్తియొక్క వ్యక్తిత్వ వికాసానికి దోహదంచేస్తాయి. వంశపారంపర్యమన్నది వ్యక్తి వికాసానికి లేదా పతనానికి హద్దులను నిర్ణయిస్తే; పరిసరాలు, పరిస్థితులు తదాశయసిద్ధికి

చేయూతనిచ్చి వ్యక్తిత్వ రూపకల్పనకు తుది మెరుగులు దిద్దుతవి.

ఆధునిక వైజ్ఞానికయుగంలోకూడ ప్రపంచ రాజ్యాలు మానవుడి సార్వత్రిక వికాసానికి సరియైన విద్యాబోధనావకాశాలు కలిగించంటలేదు. పెత్తందార్లు, ప్రపంచాధినేతలు ప్రపంచరాజ్యాలపై పెద్దరికం చెలాయించాలన్న బుద్ధికి దాసులై ఎన్నోపన్నాగాలు పన్నుతూ తమ ఆశయాలను సఫలీకృతం చేసుకోవడానికి అహరహము ఆరాటపడుతూ; మతం పేరుతో, పార్టీపేరుతో, సిద్ధాంతాలపేరుతో, జాతిపేరుతో, జాతీయతపేరుతో, శాంతిపేరుతో, మానవదృక్పథానికి బంధాలువేస్తూ, మానవతను, సమానతను సంకెళ్లలో బంధిస్తున్నారు. శాంతికాముకుల మనుకుంటున్న పెద్దలుకూడ యీ విషబంధంనుండి బయటపడి ప్రపంచ పరిస్థితులను యథార్థదృష్టితో అవలోకించలేక పోతున్నారు. నాడు శాంతిపేర రాజ్యవిస్తరణాసక్తుడైన నెపోలియన్, జాతిదురహంకారం పేర ప్రపంచాధినేత కావాలనుకున్న హిట్లర్‌ల వలెనే, నేడు అమెరికా రష్యాలు శాంతిస్థాపనపేరుతో ప్రపంచరాజ్యాల కల్లోలిత హృదయాలను డోలాయమానస్థితిలో వుంచుతూ శాంతిని మానవాళికి సుదూరంగా ఉంచుతూ పెత్తనం చేస్తున్నవి.

విద్య మనిషిలో వినయాన్ని, సదసద్వివేచనా దృక్పథాన్ని కలిగించడానికి దోహదంచేయాలి. విద్యకు గల ఉదాత్త ఆశయం ఇదేనని మనపూర్వులు బోధించారు. ప్రకృతి పురుష వివేక రహస్య తత్వాన్ని ఆధ్యాత్మికంగాను, వాస్తవరీతిలోను, ప్రప్రథమంగా పూసగ్రుచ్చినట్లు విపులీకరించింది భారతీయ ఆర్ష తాత్వికులేనని రూఢిగా చెప్పవచ్చు. జన్మ కర్మబంధాల ననుసరించియే మనుష్యుల పుట్టుక, మనుగడ, సిద్ధి ఆధారపడి ఉంటుందని ఆర్షవిజ్ఞానం ప్రబోధించింది. అలాంటి తాత్వికవిజిజ్ఞాస నేటి నాగరిక ప్రపంచానికెంతేనియు వాంఛనీయము.



# గ్రంథవిమర్శలు

## గోమతి

(నవల)

(రచన : శ్రీమతి ద్వివేదుల విశాలాక్షి. ప్రచురణ : యం. శేషాచలం అండ్ కంపెనీ - మచిలీపట్నం— మద్రాసు–సికింద్రాబాదు; పేజీలు 236. వెల : రెండు రూపాయలు.)

వ్యక్తులు పెరిగి పెద్దవ్వేసరికి చిన్ననాటి ముచ్చట్లు చిక్కుసమస్యలు తెచ్చిపెట్టి ప్రాణంతో చెలగాటాలాడి జీవితాన్ని త్యాగంచేసేవరకు వెన్నంటి తరమటం వింతగా ఉంటుంది. ఒకరికి కావలిసిన భార్య మరొకరికి అయితే అవమానం, అనుమానం మధ్య ఆ యిల్లాలు నలిగిపోయి మానసికంగా క్రుంగిపోతుంది. బాధావ్యథలప్రభావంచేత చివర కా జీవి ఈ లోకంనుండి మాయంకావాలని ప్రయత్నించి కన్ను మూస్తుంది.

'చిన్ననాటి స్నేహం ముప్పేటగొలుసుగా పెనవేసుకొన్న ముగ్గురికథ' ఈ నవల. అట్లతద్దో— ఆరట్లోయి ముద్దపప్పోయి మూడట్లోయి' అంటూ పరవశించి పాడుకొన్న ముగ్ధహృదయాలు విభిన్న మనస్తత్వాలు కల్గినవి. యుక్తవయస్సు వచ్చేసరికి కమ్మనికలలు కన్నారు. ఆ కలలమధ్య కాపుర మున్నారు. కాలం నడుస్తూంది. కలలన్నీ విరిగిపోయాయి. కలగానే కన్పించింది జీవితం. మధురస్మృతులు మనసు విప్పిచెప్పినా హృదయాలు నిగ్రహించుకోలేకపోయాయి.

గోమతి గోవిందు గోపాలం ముగ్గురూ కలసి జీవించారు. గోమతికి గోవిందు, గోపాలం దగ్గరి బంధువులు. రామనాథం గోపాలాన్ని దగ్గరకుతీసి పెంచి పెద్దచేసి తన కూతురు గోమతినిచ్చి ఒక యింటి వాడుగా చేయాలనుకున్నాడు. కాని అనుకున్నది సాధింపలేకపోయాడు. రామనాథం భార్య సావిత్రి గోపాలాన్ని గోమతిని వివాహం చేసికొంటావా అని నిలదీసి అడిగింది. అందుకు గోపాలం అంగీకరించకపోవటంతో గోవిందుతో గోమతికి వివాహమైంది. గోపాలానికి అదృష్టం కలసివచ్చింది. ధనమదంతో గోమతి గోవిందుల సంసారంచుట్టూ తిరిగాడు. గోవిందు సంపాదన చాలీచాలకుండా ఉన్నది. గోరుచుట్టుమీద రోకటిపోటు అన్నట్లు గోవిందు అవిటివా డయ్యాడు. గోమతి పరిస్థితి అధ్వాన్నమైంది. తననుతానే చూచుకొని నిందించుకొన్నది. గోవిందు గోమతిని పరిశీలించి చూచి ఒక నిర్ణయానికి వచ్చాడు. గోమతికి దూరంగా ఉండిపోవాలనిలేకపోయినా అలముకొన్న పరిస్థితుల వల్ల దూరంగాఉండాలని యిల్లువిడిచి రైలెక్కాడు. గోమతి గోవిందుకోసం పరుగులు పెట్టింది. ఆ పరుగులో గోమతి కాలుజారి పడిపోయింది. ఇక మరల కన్ను తెరవలేదు. గోవిందుకు తృప్తి కలిగింది.

'నువ్వు వెళ్ళిపోతున్నావని నాకు బాధగాలేదు గోపాలం! బ్రతుకులో బాగుపడే ప్రయత్నంలో బయటికి కాలు పెడుతున్నావు. ఈ విధంగా వెళ్ళిపోతున్నావన్నదే నా మనసులో ముల్లులా గుచ్చుకొంటున్నది. మమ్మల్ని పూర్తిగా మరచిపోకు బాబూ! ఎప్పుడయినా గుర్తుకువస్తే ఒక ఉత్తరం ముక్కరాయి. ఏ రోజైనా మనసుపుడితే ఒకసారి వచ్చి చూసిపో. ఇంతకన్నా నేను చేయగలిగింది, చెప్పగలిగింది ఏమీ లేదు' అన్నాడు రామనాథం వస్తున్న దుఃఖాన్ని అపుకుంటూ. తల్లిదండ్రిలేనివాడని, మేనల్లుడని భావించి గోపాలంపై రామనాథం మమతలు పెంచుకొన్నాడు. మమతలమధ్య పెరిగిన గోపాలం మాటమాత్రంగానైనా గోమతిని పెళ్ళిచేసికొంటానుఅని చెప్పకపోవటంతో సావిత్రికి కోపంవచ్చింది. తరువాత అతడు పై చదువులకు వెళ్ళిపోయాడు. మామయ్యపైన ఉండే గౌరవంకొద్దీ కొంతడబ్బును గోపాలం రామనాథానికి పంపాడు. అది అందరికి సంతోషం కలిగించింది.

గోపాలం పెద్దఉద్యోగస్తుడయ్యాడు. పూర్వపు గోపాలానికి తరువాత గోపాలానికి చాలా తేడా ఉన్నది. పచ్చని సంసారంలో చిచ్చుపెట్టాడు. నమ్మించి మోసం చేయటానికి ప్రయత్నించాడు. చిన్ననాటి చెలిమిని ఆస

రాగా గ్రహించి గోమతితో సరాగాలాడటానికి ముందుకు వచ్చాడు. అవిటిగోవిందును అవతలకు నెట్టాడు. గోమతికోసం ఎత్తులు వేశాడు. అభిమానం ఆదరణ లేకుండా గోమతితో గోవిందుకు విడాకు లిప్పించటానికి పూనుకొన్నాడు. అతనిహోదా అతని మానవత్వాన్ని రూపుమాపి మనసును కలుషపరచింది. గోమతి గోవిందుల జీవితాలను ఒక్క దిద్దవలసిందిపోయి వారిమధ్య ఎడబాటును సృష్టించి తాను ఆనందించాలని పరవళ్ళు త్రొక్కాడు. అతని కుతూహలం పూర్తిగాకముందే గోమతి తప్పుకొన్నది. గోపాలం గోమతిముందు ఓడిపోయాడు. అతనికి చదువు ఉన్నదికాని సంస్కారం లేదు. మనసు ఉన్నదికాని మానవత్వం లేదు. ప్రేమ పేరిట గోమతి నిండుజీవితాన్ని నిప్పులుపాలు చేశాడు. నాగరికత అని చెప్పి తన వ్రేలితో తనకన్ను తానే పొడుచుకొన్న కామాంధుడు.

గోవిందు చాల అమాయకుడు. అమ్మకుఎదురు చెప్పడు. కట్టుకొన్న భార్యకు అంతకన్నా ఎదురు చెప్పడు. పట్నంపోయి పదిడబ్బులు సంపాదించాలన్న ఉత్సాహం బయలుదేరింది. ఆ పట్నం తనను పెద్దచేస్తుందని ఉబలాటపడ్డాడు. కాని కాలం కలిసి రాకపోవటంతో తన పరిస్థితి తారుమారైంది. అంత బాధలోకూడ గోవిందు గోమతిని పల్లెత్తుమాట అనలేదు. పేదవాడికోపం పెదవికి చేటన్నట్లుగా ఉండిపోయాడు చేసేదేమీలేక.

గోమతి తెలివిగలపిల్ల. గోవిందును, గోపాలాన్ని తనచుట్టూ త్రిప్పించుకొన్నది. చిన్ననాటి చెలిమి మధ్య కేరింతలు కొట్టింది. లేతహృదయాలమధ్య పరవశించి పాడుకొన్నది. చివరికా యిద్దరి నడుమ నలిగిపోయింది.

గోపాలం తిరస్కరించాడని గోమతికి గోవిందుతో వివాహమైంది. తాళి అయితే కట్టాడు కాని భార్యకు, ఆమెనుమాత్రం పోషించలేకపోయాడు. కడుపుకాల్చుకొన్నను కఠినాత్ముడుగా మారలేదు. మంచిరోజులు వస్తాయని నిరీక్షించాడు. నీతి నియమాలను నెట్టలేదు. కాని గోమతి అంటే వ్యక్తం చేయరాని వ్యతిరేకత చివరి చివరికి అతనిలో పెరిగింది. గోమతి మరణానికి గోపాలం ఒకరకంగా కారకుడయితే, గోవిందు మరిఒకరకంగా కారకుడయ్యాడు.

శ్రీమతి విశాలాక్షి చక్కని కథావస్తువును ఎన్నుకొన్నారు. కథకు తగిన వాతావరణం కల్పించి నవలను పాఠకునిచే సొంతం చదివింపగల సామర్థ్యం ఉన్నది. హాయిగా సాగిపోయే సంసారాన్ని ముక్కలు చేస్తారు. భార్యాభర్తలను ముద్దుముచ్చటగా కాపురం చేయనీయక అవాంతరాలు కల్పించి ఎవరికివారే యమునాతీరే అన్నట్లుగా కథను ముగింపుచేస్తారు. చేయి తిరిగిన రచయిత్రిగా ప్రసిద్ధిచెందారు. అయితే ఈ నవలలోని గోమతి — గోవిందు — గోపాలం ఈ ముగ్గురూ వారి ఊహాసామ్రాజ్యంనుండి ఊడిపడ్డారా అనిపిస్తుంది. చిన్ననాటి చెలికాండ్రమధ్య యిట్టి అవాంతరాలు కలుగుతాయా అన్న సందేహం కలుగుతుంది. అంతేగాక గోపాలాన్ని మరచిపోయి గోవిందు లోకంలో మునిగిపోయిన గోమతి, ఆ గోపాలమే తనకు సర్వస్వం అన్నట్లుగా తలపోసింది. కాని పైకి అనలేకపోయింది. ఇట్టివే యింకా యీ నవలలో ఉన్నాయి. అవి ఏమంటే గోమతి గోవిందుల వివాహం అయిన తరువాత రామనాథం, సావిత్రి ఒక్కసారి కూడ కూతురిని అల్లుడిని చూడటానికి రాలేదు. అసలు వీరినిగురించి తల్లిదండ్రులేమీ పట్టించుకోనట్లుగానే చిత్రించటం సహజంగా ఉన్నట్లులేదు.

గోపాలం గోమతితో విడాకు లిప్పించటానికి ప్రోత్సహించటం అనేది నేటి సామాజిక వాస్తవికత కనుకూలమే అయినా, గోమతి శీలగుణాదులను చూచినపుడు యిట్టికల్పన ఎబ్బెట్టుగా కన్పిస్తున్నది. పోయిన గోపాలాన్ని తిరిగిరప్పించి మరల ముగ్గురి మధ్య సన్నిహితత్వం నెలకొల్పవలసింది పోయి వేరు చేయుటంవల్ల కథకు పటుత్వం తగ్గింది.

సిడాకుల ప్రస్తావన కథ కనవసరం. మన దేశంలో యూరపుసమాజంలోలా విడాకులు మొదలైనవి ప్రబలం కాలేదు.

ఎంత చెలిమికాడయినా గోవిందులా ఎవ్వరూ ఉండరు, ఉండలేరు. గోపాలం చేస్తున్న అధర్మాన్ని, అన్యాయాన్ని చూచి సహించి గోపాలం—గోమతి ఒకటిగాఉండాలన్న తలంపు, జరుగుతున్న అన్యాయాన్ని ఎదుర్కొనలేక యింటినుంచిపోయి రైలెక్కటంవంటి ఘటన చాలా అసహజంగా ఉన్నవి.

గోమతిఅంటే సానుభూతి కలిగినవాడు చనిపోయినతరువాత అంతమంది రైలునుంచి క్రిందకు దిగినా తాను దిగిచూడలేకపోయాడు. ఇంకా ఆమె చనిపోయినతరువాత అతని మనసు తేలికపడినట్లుగా చెప్పటం వింతగా ఉన్నది

సాంఘికవిప్లవం రావాలని మన నవలాకారులు గొంతెత్తున్నారు. ఆనాడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఒక పరమప్రయోజనంకొఱకు సమాజంపై తిరుగుబాటుచేస్తే ఈనాటివారు సంప్రదాయాన్ని కాలరాయటానికి నడుం కడుతున్నారు. నాగరికతఅంటే ఏమిటో తెలియని యీలోకం గోపాలంలాంటి దౌర్భాగ్యులను తయారుచేసి చేయరానిపనులు చేయించుతున్నది. అర్భకుడు అమాయకుడుఅయిన గోవిందువంటి మనుష్యులను గట్టిగా నిలబడనీయక వెనుతిరిగి పారిపొమ్మని ఆదేశాలిస్తున్నది. కన్నులనిండా నీరు నింపుకొని తప్పకు క్షమాపణ చెప్పకొనునట్టి గోమతిలాంటి స్త్రీలను రక్షింపలేదు. గోమతి మరణించినంత మాత్రాన కథ ముగిసిందికాని సమస్య పరిష్కరింపబడలేదు. సమస్య పరిష్కరింపబడాలిఅంటే గోమతి చనిపోవాలిసిందేనాఅన్న సందేహం కలగకమానదు. ఏమైనా గోమతి పాత్రను హతమార్చటంలో రసౌచిత్యంగా కన్పించటంలేదు.

శ్రీమతి విశాలాక్షి అచ్చటచ్చట లేని దీర్ఘాలు కల్పించి క్రియాపదాలను వికృతం చేసారు—మెరసిపోతున్నది అనుటకు మెరసిపోతున్నాది; రమ్మన్నది—రమ్మన్నాది; అయిపోతున్నది-అయిపోతున్నాది; ఉన్నది—ఉన్నాది; వీనిని, కాస్త సరిదిద్దితే మంచిదేమో నని పిస్తుంది.

తెలుగు పాఠకునకు విసుగును కలిగింపక కరుణకర్కశత్వాలమధ్య నలిగిపోయి ముక్కలైన 'గోమతి'—పాఠకుని హృదయంలో చెరగని ముద్ర వేస్తుంది.

—రామ మోహన్.

**1. శృంగార శాకుంతలము**

—పిల్లలమర్రి పినవీరభద్రకవి.

**2. శృంగార నైషధము**

—శ్రీనాథుడు.

**3. హరవిలాసము**

—శ్రీనాథుడు.

**4. ప్రభావతీ ప్రద్యుమ్నము**

—పింగళి సూరనార్యుడు.

**5. శ్రీ కాళహస్తి మాహాత్మ్యము**

—ధూర్జటి.

**6. పారిజాతాపహరణము**

—ముక్కుతిమ్మన.

**7. విజయవిలాసము**

—చేమకూర వేంకటకవి.

ఈ ఏడు గ్రంథాలను ఎమెస్కోవారు సంప్రదాయ సాహితి క్రింద ప్రకటించారు.

పిల్లలమర్రి పినవీరభద్రకవి శృంగార శాకుంతలము శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులుగారి సరళ పీఠికతో ప్రకటించబడినది. సాదాప్రతి రు. 2-50; లైబ్రరీ ప్రతి రు. 4—20.

శ్రీనాథ మహాకవి రచించిన శృంగార నైషధము కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారి పీఠికతో ప్రచురితమైనది. శ్రీ రావూరి దొరసామి శర్మగారు గ్రంథమును పరిష్కరించిరి. సాదా ప్రతి రు. 4—00; లైబ్రరీ ప్రతి రు. 6—00.

హరవిలాసముకూడా శ్రీనాథ మహాకవి రచనయే. ఇదికూడా శ్రీ విశ్వనాథసత్యనారాయణగారి పీఠికతోనే

ప్రకటించబడినది. సాదా ప్రతి రు. 2—50. లైబ్రరీ ప్రతి రు. 4—25.

పింగళి సూరనార్యుని ప్రభావతీప్రద్యుమ్నమునకు కవి సామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారే పీఠికను సంతరించిరి. సాదాప్రతి రు. 2—00. లైబ్రరీ ప్రతి రు. 3—75.

ధూర్జటి మహాకవి శ్రీ కాళహస్తి మాహాత్మ్యము, ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణము, చేమకూరి వేంకటకవి విజయవిలాసము కూడా కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి పీఠికలతోనే ప్రచురితమైనవి.

శ్రీ కాళహస్తి మాహాత్మ్యము సాదా ప్రతి రు. 2—00; లైబ్రరీ ప్రతి రు. 3—75.

పారిజాతాపహరణము సాదాప్రతి రు. 2-00; లైబ్రరీ ప్రతి రు. 3—75.

విజయ విలాసము సాదా ప్రతి రు. 2—00; లైబ్రరీ ప్రతి రు. 3—75.

ఈ అన్ని గ్రంథములను ఎం. శేషాచలం అండ్ కంపెనీవారు ప్రచురించినారు.

ప్రతులకు: ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, రాష్ట్రపతిరోడ్డు, సికింద్రాబాదు. 4

## పిల్లల రేడియో కథలు వ్యాసాలు

రచన శ్రీ వి. వి. ఎల్. నరసింహారావు, భారతీ ప్రచురణలు, గిరింపేట, చిత్తూరు. ధర రు. 2-50

ఇందులో అడుసు త్రొక్కనేల, కాలు కడుగనేల, కడివెడంత గుమ్మడికాయ కత్తిపీటకు లోకువ, స్వార్థత్యాగము, ప్రతిజ్ఞాపాలన, సుమతీ శతకములోని తెనుగుదనము, పాంచాలి శపథము, మతసంబంధమైన సాహిత్యము, కావ్యములు, మాలపల్లి, సాక్షి, ప్రతిజ్ఞ, జాతీయగీతం ఆదిగా కథలు వ్యాసములు వున్నాయి. బొమ్మలు శ్రీ కలువకొలను సదానంద సమకూర్చారు.

## మారిన కాలం

రచయిత శ్రీ లింగం వీరభద్రయ్యచౌదరి. వీరు ఇటీవల 'తాంబూలం—నైవేద్యం' అన్న గ్రంథాన్ని ప్రచురించారు. 'మారినకాలం' అన్నది వీరి రెండవ పుస్తకము. పల్లెటూరు, ఈ నాటి రైతు గృహస్థు, అతిథి—అభ్యాగతి, విక్రేత, మతము—మతసంస్థలు, పునర్జన్మ, శత్రుత్వం, మానం—అభిమానం, దేశీయ గోగణానికి ప్రోత్సాహం, పాల అధికోత్పత్తి, శ్రమజీవులు—బుద్ధిజీవులు, మొదలైన శీర్షికలతో వివిధ విషయములు చెప్పబడినవి. కొన్ని విషయములు వ్యాసముల పద్ధతిలోను, మరికొన్ని విషయములు కథాకథన వైఖరిలోనూ వున్నవి. మనుష్యుని జీవితములో అనేక విషయములు విజ్ఞానదాయకముగా ఉండే విధముగా ఈ గ్రంథము రచింపబడినది. రచన సాఫీగా, చక్కని తెలుగులో అందరికీ అర్థం అయ్యేవిధముగా వున్నది. గంభీరమైన విషయాలుకూడా అతి సుళువుగా వివరించ బడినవి.

శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఈ గ్రంథమునకు చక్కని పీఠికను వ్రాసియున్నారు.

వెల. రు.3—00. ప్రతులకు: దేశీ బుక్ డిస్ట్రిబ్యూటర్, అరండల్‌పేట, విజయవాడ—2.

## సూరీడు

రచన: శ్రీ ఎం. కె. సుగంబాబు. ఇందులో సూరీడు, పోరాటం, వడిసెల, ఓటు. సదువు, కులం—మతం, తలఎత్తు, నిప్పు, కదబండి అన్న శీర్షికలతో పది గీతాలువున్నవి. వెల—50 పైసలు. ప్రతులకు: ఎం. కె. సుగంబాబు, చిన్నబజారు, గుంటూరు—3.

## యక్ష ప్రశ్నలు

వ్యాసమహర్షికృతమైన మహాభారతము దీనికి మూలము. అనువాదము శ్రీ పూ. భా; మహాభారతములో ఈ యక్షప్రశ్నల భాగాన్ని యథాప్రగతి అనువదించి వున్నారు. అందులో ఆయన అన్ని యక్ష

ప్రశ్నలనూ అనువదించలేదని, సంస్కృత మూలములో వున్న అన్ని ప్రశ్నలనూ ఈ పుస్తకములో చేర్చామని ప్రచురణకర్తలు తెలుపుచున్నారు. వెల : 50 పైసలు. ప్రచురణ : శోభా ప్రచురణలు, విజయనగరం—2.

## శ్రీ మన్నెంబగిరి నరసింహ శతకము

గ్రంథకర్త : శ్రీ నంబి శ్రీధరరావు

ఇందులో ఈ శతకముతోపాటు శ్రీ నారసింహుల నాట్యము అను గేయమును, మంగళ హారతులు కూడ వున్నవి. శ్రీ సాహిత్య విద్యా ప్రవీణ శ్రీ దోర్బల విశ్వనాథ శర్మగారి పరిచయమును, శ్రీ గణపతి రామచంద్రరావు గారి అభిప్రాయమును కలవు. శతకము కంద పద్యములలో వున్నది. వెల : రు. 1—50, ప్రతులకు : శ్రీ ఎన్. శ్రీధరరావు, నిజామాబాదు.

## నా స్వామి

రచయిత : భాషా ప్రవీణ, మధురకవి శ్రీ చింతల పాటి నరసింహ దీక్షిత శర్మ.

ఇది శతకము. అయితే మామూలుగా శతకాలలో వుంటూవుండే విధంగా మకుటము పద్యము చివర వుండదు. పద్యములో ఎచ్చటనో ఒక పంక్తిలో వుంటుంది. ఆ మకుటము "నా స్వామి" అన్నదే. ఇట్లా ఇది ఒక కొత్తపద్ధతి శతకము.

ఇందులో 108 పద్యాలు వున్నాయి. రచన ప్రౌఢంగావుంది. పద్యములన్నియు మత్తేభ, శార్దూల వృత్తాలు.

మచ్చుకు—ఒక పద్యము.
భయ భవంబున, భక్తిభావమున,
దివ్య ప్రౌఢ శృంగార ని
ర్ణయ భావంబున, నీ స్వరూపమును,
నీ నామంబు, నీ ప్రేమ, న
క్షయశీలం దలపోయు వారలకు
మోక్షప్రాజ్యసామ్రాజ్య మ
వ్యయ మానందము కూర్చుచుందుకద
నా స్వామీ ! గుణాలంకృతా.

వెల—ఒక రూపాయి. ప్రతులకు: శ్రీ చింతల పాటి నరసింహ దీక్షితశర్మ; తెలుగు పండితుడు; జిల్లా పరిషత్ హైస్కూలు; అచ్చమ్మపేట; గుంటూరు జిల్లా.

---

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7 Thambu chetty Street, Madras-1. Editor : S. Sambhu Prasad.